# మాతృభూమి.



గ్రంథకర్త:

దాసరి పరిపూర్ణయ్య,

ఆంధ్రోపాధ్యాయులు, అమోవా బాలికా ప్రాథమికోన్నత పాఠశాల,

రేపల్లె.

# మాతృభూమి.

గ్రంథకర్త :
దాసరి పరిపూర్ణయ్య,
ఆంధ్రోపాధ్యాయులు, అయోవా బాలికా ప్రాథమికోన్నత పాఠశాల,
రేపల్లె.

ప్రథమముద్రణము
1000 ప్రతులు.

 1934 [ వెల రు 0-5-0.

# అంకితము

కీ॥ శే॥ శ్రీయుత దివాన్ బహద్దర్

పి. సి. ఎన్. ఎతిరాజులు నాయుడుగారికి.

ఏమహాశయుఁడు స్థానిక సంస్థలలో వన్నెకెక్కి గత పదివత్సరములలో గుంటూరు జిల్లాబోర్డునకును గుంటూరు పురపాలక సంఘమునకును అధ్యక్షుఁడుగను, మదరాసు శాసన సభ్యుఁడుగనుండి తన యసమాన మేధాబలంబుచే సత్పరిపాలనముఁ జేసి నిరుద్యోగుల కెందఱికో యన్నము బెట్టి యెన్నియో విధములఁ బ్రజల రంజింపఁజేసెనో, ఏలోకోపకారి తన కీర్తి యాచంద్రతారార్కముగ నీభువిపై నిలుచునట్లు బాపట్ల మున్నగు పాఠశాలా భవనంబుల నిర్మింపఁజేసెనో, ఏధీరాగ్రగణ్యుఁడు సీమదేశమున కేగి మంత్రులొసఁగిన విందు లారగించుటయేగాక తన భారతీయసోదరుల కష్టసుఖములను క్రమముగ వివరించెనో, ఏఘనుఁడు ప్రధానమంత్రులగు శ్రీయుత రామారాయణాం, మునిస్వామి నాయుడుగార్లకు ప్రాణమిత్రుఁడై ప్రజలకెంతయో సాయమొనర్చెనో, ఏధీరోత్తముఁడు రాజకీయతో రంజిల్లుచు పదవి పదవియని కలవరించుచు, నద్దానికై తన సర్వస్వము ధారవోసెనో, ఏదయాసముద్రుఁడు తన మిత్రుని గృహమున, స్టేటుకౌన్సిలరు పదవిఁ బొందుటచే పరమానందము నొంది పకపక నవ్వుచు పరలోకమునకు పయనముఁ జేసెనో, ఏమహామహుఁడు జస్టిస్సు పక్షమును ఒడుదుడుకులేక ఒకేమార్గమున నడిపి నద్దానికి అండయై, బ్రిటీషు పరిపాలకుల పాలిట బాంధవుఁడైయొప్పి కొలఁది వత్సరముల క్రిందటనే దివికేగెనో, అట్టి కీ. శే. శ్రీయుత దివాన్ బహద్దరు పి. సి. ఎన్. ఎతిరాజులు నాయుడుగారి యాత్మశాంతికై నా మాతృభూమిని యంకిత మొనరించుకొనుచున్నాడ. ఇట్లు

గ్రంథకర్త.

# పీ ఠి క.

గుంటూరు సెకండరీ గ్రేడు ట్రెయినింగు స్కూలులో నుండుతఱి నొకసభకు నధ్యక్షత వహించు భాగ్యతనాకు లభించినది. "భరతఖండమునఁ గల సాంఘిక దురాచారములెవ్వి? వానిని పారఁద్రోలుటకు మార్గమెద్ది? అను నంశము గుఱించి చర్చ ప్రారంభమయ్యెను. నా కొలఁది మాటలచే కూటము ముగిసెను.

నాఁటి సమావేశానంతరము మా గురువుగారగు వి. ఎస్. ప్రసాదరావు బి. ఎ., బి. ఎల్. ఎల్. టి., పంతులుగా రిచ్చిన యాశీర్వచనము వలనను, వేములపల్లి నారాయణ, మల్లెవద్ది వేంకటప్పయ్య మొదలుగాగల నా మిత్రు లొసఁగిన ప్రోత్సాహము వలనను "మాతృభూమి" యను నీ గ్రంథమును రచియించుటకుఁ బూనుకొంటిని.

ప్రభుత్వమువారి మద్యపాన నిషేధ ప్రచార సంఘము నందుఁ బాల్గొని రేపల్లె తాలూకాలోఁ జేసిన నా ప్రచారము లోని యనుభవమును, తెనాలి, ఇంటూరు ఉన్నతపాఠశాలలలో మదీయ గురువులొసఁగిన యుపన్యాసాంశములను ప్రధానముగఁ గైకొని, అక్రమ వివాహములు, ధనకాంక్ష, అస్పృశ్యత, పిచ్చినమ్మకములు, ఆర్థికదుస్థితి, ఇత్యాద్యంశములను, భారతభూమిని ఆయాసంఘములలోఁ గల దురాచారములను, నీ కల్పితకథా ద్వార పాఠశాలలలోని బాలబాలికల భాషాభివృద్ధి కనుగుణ్యముగ విశదీకరించితిని.

సెకండరీగ్రేడు ట్రెయినింగు ముగిసినవెంటనే శ్రీమతి సి. జమ్మరుమర్ల మిశమ్మగారు తమ ప్రాథమికోన్నత బాలికా

పాఠశాలయందు తెలుఁగు పండితుని స్థానములో నన్ను నియమింపఁ దెలుఁగు బోధనా పద్ధతికిని, నిట్టి గ్రంథరచనకు నెంతయో తోడ్పడెను గాన, వారికి నా శతవందనములు. భాషాభివృద్ధికిని, భావాభివృద్ధికిని జేయూత నొసంగిన మదీయ గురూత్తములగు శ్రీయుత అబ్బరాజు హనుమంతరాయశర్మ గారికిని, ములుకుట్ల వేంకటకృష్ణశాస్త్రి గారికిని, పొన్నూరి సత్యనారాయణరావు గారికిని, వి. ఎస్. ప్రసాదరావుపంతులు గారికిని, కె. ఎస్. రాజగోపాలాచారిగారికిని నా నమస్కారములు.

ప్రేమతోఁ దగుసలహాలనిచ్చిన నా పండితమిత్రులగు శ్రీయుత పేటుకూరి వేంకటనరసయ్య, తాళ్లూరి రాఘవయ్య చౌదరిగార్లకు నా హృదయపూర్వక వందనములు.

నా "మాతృభూమి"ని ప్రచురింపఁ జేయుటకు సాయమొనర్చిన భాషాభిమానులగు పోషకమహాశయులకును, మిత్రమండలి సభ్యులకును, మా ఆయోవాబాలికాపాఠశాలవారికిని, మా కృతజ్ఞతా వందనములు.

విద్యాశాఖవారును, స్థానిక సంస్థలవారును, తమ పాఠశాలలలో నీ గ్రంథమును బాలబాలికల భాషాభివృద్ధికై పఠనీయ గ్రంథముగా నేర్పరచి, నన్నుప్రోత్సాహింపఁ బ్రార్థితులు.

ఇట్లు,

పెరవలిపాలెం,
25-3-1934.

దాసరి పరిపూర్ణయ్య;
గ్రంథకర్త.

# పండితాభిప్రాయములు.

మ. రా. శ్రీ నెల్లూరు వి. ఆర్ కాలేజి రిటైర్డు ప్రిన్సిపాలుగారైన రాయసం వెంకటశివుఁడు ఎమ్. ఎ., ఎల్. టి., గారిట్లు వ్రాయుచున్నారు.

శ్రీయుత దాసరి పరిపూర్ణయ్యగారు రచించిన "మాతృభూమి"యను చిన్న కథను సంతోషముతోఁ జదివితిని. యువకుఁడైన యీ గ్రంథకర్తకుఁగల యపార సంఘసంస్కరణాభిమాన మిందలి ప్రతి పంక్తిని ప్రతిబింబితమగు చున్నది. ఉదారాశయమునకు, నుద్రిక్తభావమునకును నను గుణ్యమగు భాషాసౌకుమార్యముతో నీ చిన్నిపుస్తక మలరారుచున్నది. విద్యార్థిలోకము నీపుస్తకమెంతయు నాకర్షింపఁగలదు.

(Sd.) రాయసం వెంకటశివుడు

వెనుక నెల్లూరు కళాశాలాధ్యక్షుఁడు.

---

రేపల్లె బోర్డుహైస్కూలు తెలుఁగు పండితులగు మ. రా. శ్రీ ఉభయభాషాప్రవీణ ఏటుకూరి వేంకటనరసయ్యగారిట్లు వ్రాయుచున్నారు.

ఈ చిన్నిపొత్తము నాయెమ్మలికెంతయు నొప్పినది. తమ్ముని వావికన్నఁగడుఁగూర్చు పిరిహృదయముతోఁ గృతిజతన మొనరించి చదివితిని. దీనికొక మెచ్చుముచ్చటగానున్నది. సాంఘిక దురాచారముల బలుపో, వలపో, ముక్కుమూటిగాఁ

జూపి "ధన్యోఽస్మి"యను కొన్న వానిలోనిది యొకటి. మఱి యొకటి పఠనపాఠనక్రమమునందు కేవల కథానకమూల మున సంస్కరణ దిద్ది తీర్పఁబడినదిగాన నున్నతపాఠశాలలలోనిది పాఠ్యగ్రంథముగా నుపయోగించినఁగావలసిన మేలుసేకూరుట కెంతమాత్రము సంశయమొదవదు. తెలుఁగువారు గుండెలు గ్రుమ్మరించుకొని తమయిల్లె యిల్లుగా నెగడవలెనని నిట్టివి స్పృశించి, పఠించి, హర్షించి యిత్తోధికవృద్ధికి గ్రంథకర్తను బ్రోత్సహింతురుగాక. ఇట్లు,

(Sd.) పోతుకూచి వెంకటనరసయ్య.

---

రేపల్లె బోర్డు హైస్కూలు తెలుఁగు పండితులగు శ్రీయుత విద్వాన్ విశారద తాళ్ళూరి రాఘవయ్యగారి నుండి:-

(శ్రీ) దాసరి పరిపూర్ణయ్యగారు ప్రేమతో నంపిన తమ 'మాతృభూమి'ని సమగ్రముగాఁ జదివితిని. ఇదియొక కల్పిత గాథ. భరతఖండమున జరుగు సాంఘిక దురాచారము లిందుఁ గథారూపమునఁ బొందుపఱుపఁ బడినవి. దాన గ్రంథమునకీ 'మాతృభూమి' యను పేరు సార్థకమగుచున్నదని తోఁచెడిని. ఇందలి భాష, శైలియు చిన్న చిన్న వాక్యములచేఁ జెన్నారి సొంపు నింపుచున్నయది.

విశదముగా వ్యాకరణాంశము లంగీకరింపఁబడినవి. సమయానుకూలముగా నన్యభాషాపదములును సమకూర్పఁబడినవి.

సంస్కారము నభిలషించునట్టి తరుణమున నిట్టి గ్రంథములు పాఠశాలలలోఁ బఠనీయ గ్రంథములుగా నేర్పడిన భారతదేశభావి భాగ్యోదయమునకు నెంతయో తోడ్పడఁగలవు.

రేపల్లె, 24-3-1934 } ఇట్లు,

(Sd.) తాళ్లూరి రాఘవయ్య చౌదరి.

From,

M. R.Ry, T. S. Paulus Garu M. A.
A. C. College Guntur.

"Mathru Bhumi"is a vivid critical exposition of the Indian social evils in the story form. The style is simple and appealing. It has a real educative value. All well- Wishers of social reform will do well to read it.

T. S. Paulus,
President, Indian christian association of the Northern circars.

ప్రాచ్యభాషాప్రవీణ శ్రీయుత పొత్తూరి సత్యనారాయణరావు పంతులుగారిట్లు వ్రాయుచున్నారు.

"పూవు బుట్టగనే పరిమళించు" నన్నట్లు మాతృభూమి గ్రంథకర్తయగు శ్రీదాసరి పరిపూర్ణయ్యగారు గుంటూరు సెకండరీట్రయినింగు స్కూలులో నా శిష్యుడుగానున్న లేత

నితని ముద్దుల మూటగట్టెదు భాషాప్రాగల్భ్యమును బట్టి పండి తుఁడగు ననుకొంటి.

భాషాసౌశీల్యతతోఁ బాటు భావగాంభీర్యములతో నీ గ్రంథము తనరారుచు బుద్ధి వికాసమునకు నెంతయో తోడ్పడు చున్నది.

భారతదేశదురాశా పిశాచమును బారఁద్రోల, నిది తుపాకియై తారొ్కనుచున్నది. కాన ప్రస్తుతము ఉన్నతపాఠ శాలలలోని స్కూలు ఫైనల్ తరగతివారికిట్టి గ్రంథమును పఠ నీయ గ్రంథముగా నేర్పరుపఁగలిగినచో నిశ్చయముగా నాం బాలబాలికల యదృష్టమే!

శిష్యా! ఇట్టి గ్రంథముల పెక్కింటిని రచించి మాతృ భూమికి మహోపకారమొనరింప సర్వేశ్వరుఁడు సదా నీకు తోడై యుండుగాక!

ఇట్లు,

గోరంట్ల.
19-3-1934

(Sd) ప్రాచ్యభాషాప్రవీణ,
పొత్తూరి సత్యనారాయణరావు.

# మాతృభూమి

## మొదటి ప్రకరణము



భానుఁడుదయించెను. మదరాసు సెంట్రలు స్టేషను కడ జనులు క్రిక్కిఱిసియుండిరి. పూదండలచే నలంకరింపఁ బడిన మోటారుకారులు మెండుగనుండెను. అఱవ సోదరుల గూడ కట్టులుగాక యాంధ్రుల యాచారముల ననుసరించిన బిళ్ళగోచులవారు కారుల నాక్రమించుకొనిరి. సమస్తాభరణములు మెడధరించి, వినాయకుని బొజ్జను మించిన బొజ్జగలిగి, దాదాపు ఏంబది వత్సరముల ప్రాయముగల నొక వ్యక్తిని నచ్చటివారు మెల్లఁగ కారులోఁ గూర్చుండఁ బెట్టి, వాద్యంబుల ధ్వని మిన్నుముట్ట, నూరేగింపు ప్రారంభమాయె. "పాపమీ ముసలి కేమివచ్చి పరలోకగతుఁడయ్యెనోగదా! సాతాని మతము ననుసరించి పీనుఁగు నిటుల స్మశానమునకుఁ గొంపోవలయును గాఁబోలు," నని కొందఱనుకొనుచుండ—"కాదు కాదీతఁడు సజీవుఁడే—రాజమహేంద్రమునుండి యిట వ్యాపారమున కరుదెంచిన త్రిపిలికేని నివాసియగు సోమయాజులవారి ప్రథమ కుమారిక నీముసలి కీయనుండె" నని యెవ్వరో దెలుప, కటకటా! భారతదేశమున బాలికల స్థితి యిట్లుండెఁ గదా! యని తలపోయుచుఁ గొందఱరుగుచుండిరి.

సోమయాజులగారి యింటికడ కూరేగింపువచ్చె. పెండ్లి కుమారుని నెమ్మదిగ కారునుండి పందిరిలోనికిఁ దోడ్కొని వచ్చిరి. ఏమేమో సవరించుకొనుచు నెట్టకేలకుఁ బెండ్లివారం దఱు పందిరిలోనికి హాజరైరి. "ఇది మహాపట్టణము—మహా సముద్రమువంటిది—విడుదులు గిడుదులు విచారింపవలసిన యవసరములేదు — కాలమతీతమగుచున్నది—ముహూర్తపు ఘడియలు సమీపించినవి—పెండ్లికుమారునిఁ దీసికొనివచ్చు టయే యాలస్యము—మేము సిద్ధముగ నున్నారము" అని పెండ్లిపెద్ద పేరయ్య హడావుడి సేయుచుండె.

పంచకావ్యములు పఠనచేసిన కమల — సంగీతమున వన్నె కెక్కిన కమల-అస్పృశ్యత నడుగంటచేయఁదలఁచు కమల, స్త్రీస్వాతంత్ర్య మను సంశమున బీచి యొద్దునఁగల రెండువేల సభ్యులఁ దన ముద్దులొల్కు మాటలచే రంజింపఁజేసిన కమల-ఎట్టియికట్లు సంప్రాప్తించిన సీతనువుండు నంతవఱకు నిను బాయ—నేను నీదానను—ముమ్మాటికి నమ్ముమని మేనత్త కొమరున కభయ హస్తమిచ్చిన కమల—చిఱుప్రాయముననె చెనఁటులగు ముదుసలి భర్తలను గోల్పోయిన వితంతు బాలి కలఁజూచి జాలిగూర్చి తగురీతి నాదరణసేయు కమల—నేఁ డెట్లుండెనో వేరు చెప్పవలెనా!

"నీకుఁ దెలియదు. చెప్పవలసిన వన్నియు నిదివఱకె సమగ్రముగఁ దెల్పియుంటి. అతడు ముదుసలి—ఏ కొలఁది దినములో మాసములో మాత్రము జీవించుట యదార్థము. ఐదులక్షల రూప్యములు, రెండువందల యెకరముల మాగాణి

భూమియు, మేడలు మనపాలగును. కమల నెట్లో యొకట్లు సంతోషపెట్టవచ్చును.—మా వృపను సంతోషము కలిగించే నిదా! నామాటలు వినుము. కాలమాసన్న మగుచున్నది. "చెప్పినవారు పెద్దలు" అని గ్రుడ్లురుముచు నేమేమో కఠిన నిందలు సోమయాజులవారు భార్యపై విసరుచుండిరి. రాక్షస కృత్యముల కడ్డుపడు వారెవరు! దుఃఖసాగరమున మునింగిన కమలను, యమపురి కాహ్వానింపఁబడిన బొజ్జయ్యగారిని కీలలపైఁ గూర్చుండఁబెట్ట, బ్రాహ్మణులు మంత్రములు వెదజల్లుచుండ, అమ్మలక్కలు దంపతుల యీడు జోడులఁ గూర్చి నగచుచుండ, తల్లి యొకమూల దిగాలఁబడి దుఃఖించుచుండఁ, పెళ్ళిళ్ళ పేరయ్య పెత్తనము చెలాయించుచుండ, అటుఁగల పెద్దలాశీర్వచనములతోఁ బెండిలి పూర్తియయ్యె.

కటకటా! మాతృభూమికెట్టి దుస్థితి సంభవించె!

## రెండవ ప్రకరణము

'ఓసీ! నీకేమియుఁ దెలియదు. ప్రపంచానుభవ మంతగాలేదు. ఎల్ల నీచకార్యములకును ధనమే మూలము. ధనమున కాసపడి బంధుత్వమును కులగౌరవమును దేశాభిమానమును పాటింపక మార్గమధ్యమున వేసఁగి యెండ వెడారులలోఁ గాన్పించు జనంబుపై జాలిడక, నిలువునఁ బ్రాణంబులఁదీసి ధనంబును నగలను సంగ్రహించు వారెందరో యీ ధారుణీమండలమునఁ గలరు. లంకెల బిందెలచే లక్షాధికారులు కావలెనని యెంచి, నిరపరాధులై పరుగిడు పథికు

లను, పసికూనలను, నిఱుపేదలను, వృద్ధజనాంగమును నక్కటికె మొకింతయు లేక, నిలువున నరబలులకై ప్రాణంబులూదీయు వారీ వసుంధరపై వేనకు వేలుగలరు.

గుణవతియు, రూపవతియు, విద్యావతియునైన బాలిక మేనమామకడఁగాని, సోదరికడఁగాని యున్నను, వారలు పేద వారలగుచో, గృహిణికి నుండదగు మీాది యంశములను, చుట్టఱికమును సైతము లెక్కచేయక, పిల్లనుఁ జేసికొనలేదు గదా యని వార లలిగి విలపించుచుండినను, వారి మొర లాలకింపక, బాలిక కుంటిదైనను, గ్రుడ్డిదైనను మఱి యెట్టిదైనను నాలుఁగు వేల రూప్యములు కట్నమెక్కువుండుచో నెంతో సంతసముతో నర్థాంగిగా స్వీకరించువారు వేలకొలఁది ప్రజలు గలరు. బాలికనుండి వచ్చు నాస్తి కాసపడి, బాలిక రెండు లేక మూఁడు వత్సరముల ప్రాయమున్నను బెండ్లాడి తన యౌవనకాలమంతయు వేరొండు విధములఁ గడుపు వారీభువిలో నెందఱో గలరు. భార్య యుండగనె తగు కట్నముతోఁ బిల్ల నిచ్చెదనన్న, ధనకాంక్షచే ద్వితీయ వివాహమాడుటయుఁ గద్దు. వివాహకాలమునఁ జదివించిన కట్నమును మామగారొసంగక పోవుటచే, రంభవోలె నుండిన తమ రమణిని పుట్టింటికిఁ బారఁదోలి, పరగార ధనాదులఁ గోరు పందమార్గమున మెట్టువారీ ప్రపంచమున లెక్కకు మిక్కిలిగ పొడగట్టుచున్నారు. ధనవంతుఁడగు ముదుసలికిఁ దన కుమార్తె నిచ్చుచో త్వరితముగా వితంతువై భర్త సర్వస్వము తమకు ధారవోయుట కవకాశ ముండునని యెంచి తమ బిడ్డల వృద్ధుల కొసఁగువారు మన

య్యగ్రకులజులలో లక్షోప లక్షలు. అందు మీయన్న ప్రధానుఁడు. ఎందుకిట్లు వగచెదవు. కష్టపడి తుదకుఁ గొన్ని భూములను గూడ విక్రయించి మన విజయునికి 'బి. ఎ' వఱకెట్లు విద్య చెప్పించితినో నీకే తెలియును. ఇన్నియేల! మనవానియందు నేఁజేసిన లోప మెద్దియునులేదు. కమలావిజయుల సంభాషణలఁ బట్టి కమల తప్పక విజయుని బెండ్లాడు ననుకొంటిని. కానిమ్ము మన వానికిఁ బిల్లలనిచ్చువారు లక్షోపలక్షలున్నారు. ఇందు ముంచుకొని పోయిన దేమియులేదు. దిగులు విడనాడుము. నేటితో మనకును మీయన్నకును ఋణము తీరినది. ఇంక నతఁడెవ్వఁడు మనమెవ్వరము'. 'నాయనా! విజయా! విచారింపకుము. కమలకును నీకును జరిగినదంతయు స్వప్నముగానెంచి యాపెను మరువుము. గొప్ప చుట్టఱికముఁ జేపట్టి గుణవతియగు కన్యనుదెచ్చు భారము నాది. మన బందరులోని ప్రజలెల్లరు నిద్రించినట్లు దోచుచున్నది. అల్లదిగో పదునొకండు గంట కూడ వినఁబడినది. పోయి పరుండుము'అని తండ్రి దెలిపెను.

'నాయనా! కమలను మునుసలియగు మండవల్లి గ్రామవాస్తవ్యున కిచ్చుటయు, మదరాసులో మొన్ననె పెండ్లి జరుగుటయు మొదలుగాగల వృత్తాంతమంతయు నా మిత్రుఁడు కమ్మ ద్వార తెలియపరచె. అయ్యది దాపనేరక మా జననితోఁ దెలిపితి. కాని నా కంతగా విచార మొందవలసిన కారణంబులేదు'. "అమ్మా! నీవేల వగచెదవు. నాన్నగారు వచింపలేదా! ఇంక మీ యన్నగారెక్కడ మనమెక్కడ.

ఊరడిల్లుము." అని పలికి తలిదండ్రులనుండి సెలవు గైకొన్ని, తన గదిలోఁ బరుండి విజయుఁ డిట్లు తలపోయుచుండె.

"కమలా! నీకును నాకును జరిగినదంతయు స్వప్నమా! నీవు ముసలిని జేపట్టుట స్వప్నమా! కటకటా! ఈ మాయా ప్రపంచమున వసించు జీవరాసుల వశపఱచుకొని వాని చర్యల గ్రహింపవచ్చునుగాని స్త్రీ జాతి మనోవాంఛల నెఱుఁగుట కడుదుర్లభము. ఎంతమోసము—ఎంతమోసము. కమలా! పిన్ననాటనుండియు మనమాడిన యాటలు పాటలు మరచితివా! ఆనాఁడుద్యానవనంబులోఁ జల్లని పిల్లగాడ్పులకై విహరించుచుండ, మల్లెపూదండ నప్పుడే గ్రుచ్చి నీవా ర్భాగ్యుని మెడలోవైచి, 'బావా! భూమ్యాకాశంబులు గమనించుచుండ, నిట వృక్షలతాదు లాలకించుచుండ, మదీయమనోనిశ్చయము దెల్పుచున్నదాన - కమల యనెడి యీ యబలకెట్టి యిక్కట్లు సంప్రాప్తించినను తన ప్రియుఁడు — ముద్దులబావ—అగు విజయుని మరువదు—సమస్తము విజయునిదే" యని నుషువుచు 'బావా! ఈ గులాబిపుష్పంబు గైకొని, ఎన్నికష్టంబులకు లోనైన నీ కమలనె పరిణయ మాడెదనని, ఈ లత లానగా వాగ్దత్త మొసగుమా' యని యంటివే, ఆనాఁడు చేసిన బాసల నే మంటఁ గలిపితివి. తుచ్ఛ లౌకిక సౌఖ్యము లనుభవించుటందలి పేరాశచే నిన్ను నీ తలిదండ్రు లా వృద్ధునకు గట్ట దలఁచియుండ, నొక కమ్మ వ్రాయఁ గూడదా! లేక నన్ను చేగ నభిలాషయే యున్న 10 గంటల కాలముపట్టు

ప్రయాణమే ధూమశకటములో చేయలేకపోయితివి? తంత్రి యేమయ్యె? మిత్రమండలి యేమయ్యె?

ఛీ! స్త్రీజాతి నమ్మఁగూడదని భారత రామాయణాది గ్రంథములు సహస్రధా దెల్పుచుండ, నిన్ను నమ్ముట నాది వెఱ్ఱిగాదె. జలచరాదుల యునికిఁగనుఁ గొనవచ్చును గాని స్త్రీల మనోవాంఛలఁ గనుఁగొన నేరితరంబు! కమలా! నేఁటితో నీకును, నాకును ఋణము తీఱినదే! ఆ ముదుసలి భర్తతో సుఖముగఁ గాపురము చేసికొమ్ము" అనుచు దన్ను దా మరచి విజయుఁడు కమలనే కలవరించుచుఁ బరుండెను.

## మూఁడవ ప్రకరణము.

ఉదయము తొమ్మిది గంటలయ్యెను. నాయుఁడు పేటయందలి స్టేషనులో పలురకములగు బాటసారులు ఢిల్లీకేగు ధూమశకటమునకై వేచియుండిరి. నవనాగరకత విద్యార్థి బృందము నానావిధములగు ఫేషనులతో మెఱయుచు, హిందూపత్రిక నటునిటు తిరుగవేయుచుండ, బుడిచెంబులతో బిళ్లగోచులవారును, మరచెంబులతో నర్థాంగులవెంట నిడుకొనిన యఱవ సోదరులును, గుడ్డలమూటలతోడను, పచ్చళ్ల జాడీలతోను, బోడెమ్మలు తయారైరి, రైళ్లలోను ఆసుపత్రుల యందును గల యంటునుగూర్చి యేమేమో చెప్పుకొనుచుండ నొకమూల నిరువురు వ్యక్తులు రహస్యముగ మాట్లాడుకొనుచుండిరి. అందొక రూఁకొట్టుచుండ మఱొకరేమేమో దెలుపుమని వాక్రుచ్చుచు, ధూమశకటము స్టేషనుచేర 'సంజయా

మఱవక యన్నియుఁ బూసగ్రుచ్చినట్లు దెలుపుము సుమీ' యని దెలిపి, నిజగృహంబునకుఁ జనుచుండె.

పదుగురెక్క రైలు కదలెను. ఒంటరిగఁ గూర్చుండిన యొక తాత పెట్టెయందు సంజయుడెక్కి, తాతగారితో నేమేమో మాటలాడ నిశ్చయించుకొనెను. పరిచయములేని దేల పలుకరించవలయునని సంజయుఁడు—కుఱ్ఱఁడు పలుకని దేల పలుకవలెనని తాతగారు మోములు చూచుకొనుచు మిన్నకుండిరి. మాటలు వియ్యమందలేదు. ధూమశకటము నెల్లూరుచేరె. అటనొక యాదిమాంధ్రుఁడు తాతగారిబండిలో నెక్కఁబోవ, మఱియొక పెట్టెఁ జూచుకొనుమని మిఱ్ఱి మిఱ్ఱి చూచుచుఁ బెట్టెతలుపు వేయనుండ, నీ హడావుడిలో తాత గారి వ్రేలందులోఁ జిక్కి నెత్తురుగారుచుండె. ఆపత్కాలమున నక్కఱపడని వారెవ్వరుందురు! సంజయుఁడు వెంటనే తన సూటుకేసునందలి మందుదీసి, నజ్జ నజ్జయిన తాతగారి చేతి మీద రాయ గారడీవిద్యయో యన్నట్లు వెంటనే తాతగారి బాధపోయి బోధలోనికి దిగినది.

తాత:—తండ్రీ నన్ను రక్షించినావు. మీరెవరయ్యా?

సంజ:—మేము బ్రాహ్మణులము.

తాత:—మంచిది నాయనా, ఎట్లెట్లో తప్పించుకొని యీ పెట్టెలోఁ బడితిని. దేనిలోఁ జూచిన పంచములు టీకుటాకుగాఁ గూర్చొనియుండిరి. ఈ దౌర్భాగ్యుని మూలమునఁగదా, నాచేయి నలిగినది. నీవులేనిచో నాగతి యేమయ్యెడిది. పైగా వీరలు హరిజనులఁట.

# మూఁడవ ప్రకరణము

సంజ:—తాతగారూ ! వారేల యిట్లుండెదరు ?

తాత:—బాబూ, నేతి బీరకాయలో నెంత నెయ్యిగలదో, బెల్లముకొండ యందెంత బెల్లముగలదో, పెరుగుతోటకూర యందెంత పెరుగుగలదో, వారిలో నంత హరిభక్తిగలదు. హరిభక్తిసేయుచున్న మనుష్యుల యిట్లు హింసించెదరు.

సంజ:—ఏమి, వారెట్లు హింసించిరి ?

తాత:—ఏమా ! వారలను చూచునప్పటికి మా కొండలంతయుఁ గంపమెత్తును. కొన్ని తేళ్లో పాములో పీకుచున్నట్లు తాపమొదవును. మమ్ముఁ దాఁకిన వారికి వచ్చెడి ఘనతయెట్టిదియు లేదుగదా ! అట్టివారో మమ్ము దాకనెంచి మా మనస్సుల కష్టపెట్టవలయును. అగ్రజన్ములకు నొప్పి కలిగించుట హరిభక్తుల కర్తవ్యమైన పనియా?

సంజ:—తాతగారూ ! వారన మీ కింత కోఁతనేల? వారు మాత్రము మానవమాత్రులు గారా? వారలఁ గోసిన రక్తమును మనలఁ గోసిన పాలా?

తాత:—అయ్యో ! యివన్నియు మీ పిచ్చి సిద్ధాంతములు. మా కాలములో పంచములు కిర్రుచెప్పులు వైచుకొని నడిబజారునఁ బోవుటకు వీలులేదు. మా తాత లయాములో మొలలో చీపిరికట్ట, చేత ముంత పట్టుకొని, యుమ్మివచ్చిన ముంతలో నూసికొని క్రిందఁబడుచో నూడ్చుకొని పోవలసినదే. మా ముత్తాతల కాలములో ఆ జాతులను పశువులకంటె హీనముగఁ జూచిరఁట.

ఇప్పుడు మన బోడెమ్మలు మడి గట్టుకొని నిండు బిందె రొండినిడుకొని 'ఓ రబ్బీ! దూరముగా నుండు మ'ని మైలుదూరమునుండి చేతితో సిగ్నలిచ్చు చున్నను దొలఁగుటకు మారుగా నవ్వుచు, 'ఏమమ్మా! మీలాటివారలమే! బొత్తిగా మీకు పశువులముగా గనుపించు చున్నామా! మీరు తాకమన్నను తాక ములే'యని బిఱ్ఱునమూతి బిగఁబెట్టుకొని నిలుచుందురు. ఇది ఇండ్లకడ నప్పీలుచేయుగా, దానిపై మేము యాత్రను దీసికొనుటకు సిద్ధులమై యుండుతఱి, తెల్ల దొరలు కారులు మా పల్లెలలోకి రఱియుచుండ, దిగాలపడి యుత్తరునిభంగి యిండ్లలో దూరుటకుఁ, దహతహ బడుచుంటిమి. మీ రన్ననో బబ్బన్నలై గోవుపాదమంత పిలకజుట్టిడుకొనుట సిగ్గుగా నెంచి వారల క్రాఫింగులు—బూట్లు——సూట్లు మొదలు గాగల ఫేషన్లుతో తయారై, కేవలము ఆంగ్లమానస పుత్రులమని యెంచుకొనుచు, హైందవసాంప్రదాయము నడుగంటఁ జేయఁ బుట్టిన తిమ్మన్నలా యన్నట్లు క్రాంచి కటింగులతోడను, పెడపాపల్లతోడను వర్తించుచుంటిరి. ఇఁక మీ యర్ధాంగులఁగూర్చి దెలుపవలెనన్న, వేశ్యల ఫేషన్ను నుదహరించినఁ జాలునుగదా! ఏమంత వింతగా జూచుచున్నావు. నాయుపన్యాస ధోరణి నీకంత గూడ వగా నున్నదా? స్వజాతివాఁడవని విని స్వతంత్రించి మాట్లాడితిని. నవనాగరకతా ప్రపంచచేష్టలచే మన

మున రగులుకొనిన మంటను బయటకుఁ గ్రక్కితిని. తప్పున్న క్షమించుడు. పెద్దవాఁడను.

సంజ:—తాతగారూ! తమరు బలికినదంతయువినగా వింతగను కడు చమత్కారముగ నున్నది. కోపమెందులకు? తమవంటివారిని క్షమించుటకు నేనెంతవాఁడను. అనుభవశాలులు. పట్టణము యొక్కయు పల్లెటూరు యొక్కయు జీవితము ననుభవించినట్లు గన్పట్టుచున్నది. నాకుఁగల యుద్దేశముల తమయెదుట బెట్టెద, న్యాయ దృష్టితో శాంతముగ నాలకింతురా?

తాత:—మువ్మ్రాటికి సంతోషముగా—తెలిచినఁగదా! వెన్న వచ్చుట.

సంజ:—ఆర్యా: మన మిపుడు ఒంగోలు చేరనున్నాము. బెజవాడ బోవుటకు సాయంకాలము $3\frac{1}{2}$ గంట లగును. నేను బెజవాడలోనె బండి మార్చవలసి యున్నది. కాన సావధానముగ మాట్లాడుకొనుటకు వలయునంత వ్యవధిగలదు.

నాది నాయుఁడుపేట. హూణభాషయందు ఇంటరు మీడియటు వఱకునుఁ జదివితి. తమరనినట్టుల—కేవల మాంగ్లమానస పుత్రునిగా నెంచుకొనుచుఁ జూచినవస్తువెల్లఁ గొని, తండ్రి పంపిన ద్రవ్యమెల్ల వ్యయముచేసి—పూట కూళ్ళింటియందును కాఫీహోటలులోను బాకీలు పెరుఁగుచుండ, డబ్బియనిచో "అన్నమునకు రావద్దయ్యా" యని హోటలు మేనేజ రనునేమోయని యనుచిన మతనియొద్దకేగి

కల్ల బొల్లి కబుర్లు చెప్పుచు—నేను పేదవాఁడను గాదని యనుకోగలందులకు మాయింటిని గూర్చియు, భూములఁ గూర్చియు నమితముగానుగ్గడించుచు, నానావస్థలఁ బడుచు, "నాయనా ! యింతవఱకెట్లో యొకట్లు విద్యచెప్పింపఁ గలిగి నందుకుఁ దమకు నావందనములు. నేనుండునది పట్టణము. పుస్తకములకు గది యద్దెలు మొదలుగాఁ గలవానికెంత ఖర్చు పెట్టవలయునో యూహించుకొనుము. పరీక్షకు డబ్బుచెల్లింప వలెను. ఇంకను ఖర్చులుగలవు. ఇంతయేల రేపు సాయం కాలములోపల డబ్బుచేరనిచో, నీకుమారుఁ డెన్నియో కష్టములకు లోనౌను. టెలిగ్రాము మనియార్డరు పంపుము. మీఋణమెప్పుడైన తీర్చుకొనగలను" అని మాతండ్రికి మదరాసు నుండి టెలిగ్రాములు పంపుటలోనె కాలము వెళ్ళబుచ్చితిని. ఇన్నియేల, నాస్వీయచరితము దెలుప నాకే సిగ్గగుచున్నది. నావంటి నవనాగరక యువకులు పలువురు లేరని గాదు నాయభిప్రాయము. అట్లుండుట మంచిదనియుఁగాదు. కడు మితవ్యయముఁ జేసి పెద్దల ననుసరించి విద్దె సంపాదించుట యుత్తమంబను తీర్మానముతో నేఁగూడ నేకీభవించుచున్నాఁడ. కాని మనపూర్వపు టాచారములకడనె నాకు చీకాకు పుట్టుచున్నది. స్నానము సంధ్య మొదలగునవి శరీరారోగ్యము కొఱకు పూర్వికులు పెట్టిరిగాని, జాతిభేదపరిశీలన కొఱకు కాదని నాయభిప్రాయము. తాతగారూ ! నిజమాలోచింపుఁడు. నైచ్యమునకుఁ బాల్పడు శునకము మొదలగు జంతువుల నగ్రకులజులు తమ యిండ్లలోనికి రానిత్తురు

గాని పంచముల రానిత్తురా! సదసముల సాకుగాదేనేల! మసముపయసముచేయునది ప్రభుత్వపు చట్టములకు లోఁబడి పరుగిడు కంపెనీవారి ధూమశకటము. కంపెనీవారి కెల్లరు సమానులు. ప్రయాణికులు కూర్చుండ తగిన తరగతి పెట్టె లలోఁ గూర్చుండిన, భేదభావముతో నించుకయైనఁ గన్నెత్తి చూడరు. తమరపుడు గెంటిన పంచముఁడు బలాఢ్యుఁడు గాన వేరొక పెట్టెయందు బాఁడి సాగుచుండినను ఎక్కఁగలిగె. లేనిచో నాతని పనియేమయ్యెడిది. కళాశాలలో సైతము విద్య నేర్చి పట్టభద్రులైన ఘనులు నిమ్నజాతులలోని పైయధి కారులకు గారెలు పూరీలతో సహా ఘనముగఁ జూచుచు, సగౌరవముగ సెల్యూటు సైతము సమర్పించుచు, అనధికారియైన యాదిమాంధ్రుని, యరుగు చెంతకు సైతము రానీయని వారెందఱో యీభువిపై యుండ తమ్మున తప్పేమిగలదు. తాత గారూ! ఇన్నియేల, ఈశ్వరుఁడు ఎన్నియోవిధముల చిత్రాతి చిత్రముగ నీప్రపంచమును సృష్టింప, నా సృష్టి యంతటికి నంటను దానిని మీరు సృష్టించితిరి. మెండియు, భారతదేశములోఁ గల బావులకు, చెఱువులకు, కుంటలకు, గోపురములకు, నదీనదం బులలోఁగల రేవు స్థలములకు, పాఠశాలలు మొదలగు వానికి నంటు తగులకుండుటకై యీ యవనిలోఁగల సర్వ మార్గముల నెన్నియో యవస్థలు పడుచుండిరి. అతివేగ మున పరువిడు ననిలము నాపశక్తియే లేదు గాని, లేనిచో నింత వఱకుఁ గల మారుతము ఆదిమాంధ్రులది. ఇటగల గాలిహిందువులది. అని వాయుభగవానుని వేఱుచేసెడి వారె-

వాయువేగమున వారిధి చేరనేగు వాహినులకు ఆనకట్టలు గట్టి కర్షకులకు మేలుచేయుటలో బ్రిటీషు ప్రభుత్వమువారెంతయో పూనుచుండ—బుద్ధిజాడ్య జనితోన్మాదులగు పూర్వాచార పరాయణుల ప్రభుత్వము నదీనదంబులలో నానాజాతులకు రేవుస్థలములు నిర్ణయించుటలో యావజ్జీవము ధారవోయుచుండె. పథికులయవస్థలఁ బారఁద్రోల ధూమశకటముల దొరతనమువారు వేయ, వానిలో అంటును జొరనివ్వకుండ కాపాడుటకు వ్రేళ్లనుసైతము నలుగగొట్టుకొను మీవంటి తాతలెందరో యీ ధరపైఁ గలరు. అదిగో కోపమువచ్చి నట్లున్నది. శాంతముగ నాలకించెద నంటిరిగాన ప్రారంభించితిని. కొంచెము కాలమోర్చుకొనుఁడు.

మనమన మనమేగాదు. బ్రాహ్మణేతరులు మట్టుకంత యోగ్యులా! అందఱమనపిచ్చి కృషీవలులు సరిదోసరి. వాములలో గడ్డిమోపుల నెత్తునపుడు, పొలములలోఁ గలిసి పని చేయునపుడు, తాకినను జూచియుఁ జూడనట్లుగా బోదురుగాని. యిండ్లకడ నెవ్వరేనియుఁ జూడఁగ దాఁకెనా, యొడలంతయు కంపమెత్తినట్లు గోకుకొనుచు పదిబిందెల నీళ్లతోనైనను పరితృప్తిచెందక స్నానము చేయుదురుగదా! యిట్టి దురాచారములనుండియేగదా! మన భరత భూమికవితామహులకును, సంఘసంస్కర్తలకును, బుద్ధిమదగ్రగణ్యులకును జన్మభూమియై, యీ ధారుణీమండలమున మణిభూషణమువోలెఁ బ్రకాశించుచుండినను, రాజకీయములలో రాణింపులేక ఐకమత్యమును బొందనేర కధోగతిపాలై పోవుచున్నది.

తాతగారూ ! ఒక్కమాట. వారలు మూర్ఖులందమా! వారలకంటె పైజాతులందు కడు మూర్ఖులై, మద్యపానాసక్తులై, జూదగాండ్రై, కలిమినెల్లఁ గోల్పోయి యాలుబిడ్డల నధోగతిపాలు చేసి, కట్టుటకుఁ గుడ్డ, తినుటకుఁ దిండిలేక, మలమలమాడుచు నెట్టకేలకెన్నియో నీచకార్యములు సేయు ఛాండాలురనేకులున్నారు. వారలను నేఁడే మన గ్రామములనుండి పంచములఁ దరుమురీతి తరుమవలయునా? తరుమఁగల పూరుషులుగలరా? వారలలో క్రైస్తవమతమును స్వీకరించి భుజించునపుడు, పరుండునపుడు, వెండియు వేరొండు వేళలయందు, స్త్రీలేమి, పురుషులేమి, బాలబాలికలేమి కలిసి కంఠంబులనిచ్చి కీర్తనలఁబాడి యానందాబ్ధి మునుఁగుచు, అనవరతము దైవప్రార్థన చేసికొను వారి విషయముకూడ యోచించకుండనిమ్ము. భారతరామాయణాది పురాణగ్రంథములు పుష్కలముగాఁ జూచినను, హైందవ మతమే శరణ్యమని దలఁచుచు, సాంధ్యకృత్యములు దీర్చి గాయత్రి జపించు మన యాదిమాంధ్రుల గతి యేమి? వారలు వైద్యనిపుణులైయుండ, మనరోగుల గాలి సోకనీయక పోయినను బ్రాహ్మణేతర రోగులకడకేగి చేయి చూడ వినుగుడువారై పట్టుగుడ్డలు లేనిచో మచ్చులనుండి జేజెమ్మల పాత పట్టురవికలుదిగితయారై యుండును గదా! ఇయ్యది శతాబ్దమున లేదందురా, నేటికిసైత మాంధ్రదేశమున అస్పృశ్యతా నివారణోద్యమము నడుగంటచేయు మార్గాను మహాసయు లెందరులేరు ! పంచములుగల పాఠశాలల కేగునపుడు పంచలుమార్చు విద్యార్థు లెందఱులేరు ! నిమ్నజాతుల

లోని యుపాధ్యాయులు ఉపాధ్యాయినులు హిందువుల పాఠశాలలలో, స్థానిక ప్రభుత్వమువారిచే నియమింపఁబడిన, నంటుచేఁ గొంప, పోవునేమోయని తమబిడ్డల పాఠశాలల కంపని పెద్దలీ భరతఖండమున నెందఱులేరు ! ఆదిమాంధ్రుల, పాఠశాలలలోనికి చేర్చుకొనని పక్షమున, గ్రాంటులు సున్న చుట్టెదమని ప్రభుత్వమువారు బెదరించినను బెదరక తమ కర్తవ్యము నెరవేర్చుకొను ఘనులీ భారతభూమి నెందఱులేరు! చట్టములకు భీతిల్లి చేర్చుకొనియుఁ బూర్వాచార పరాయణుల పోరుపడలేక ఆదిమాంధ్రుల పిల్లలను దమ పాఠశాలలనుండి శునకములఁ దరుమురీతి తరుము మహామహులీ మహి నెందఱు లేరు ! కట కటా ! వీరిస్థితి అమెరికా సంయుక్త రాష్ట్రముల లోనినీగ్రోలకంటె హీనమైనదిగదా !

తాతగారూ ! ఇన్ని యేల, మన మాతృభూమి యంతయు వేర్వేరు జాతిభేదములతోడను, మతభేదముల తోడను, ఆచారవ్యత్యాసములతోడను నిండుకొనియుండుటచే నింతవఱకు దాస్యనిమగ్నులమై యున్నాము. పరదేశీయుల పాలనదప్ప స్వదేశీయులపాలనగలదె!

వంకాయలు దినగూడదని యొకపక్షమువారనుచుండ, పెద్దయుల్లిదిన్న పాపమని వేరొక పక్షమువారు వాదించు చుండిరి. మాంసభక్షణవలదని యొకరు మొరపెట్టుచుండ, దానిని మద్యముతోఁబాటు వాడుటమంచిదని యొకరను చుండె. పందినిఁజంప మహాపాపమని యొకరనుచుండ, గోవునుఁజంప పాపమింతంతగాదని వేరొకరు వ్రాక్రుచ్చుచుండె.

మద్యపానము మానుఁడని మందలించు వారెందరోయుండ, అది యమరులు త్రాగిన యాకాశగంగ యనియు, ఉడుకును గొట్టివేయుటకు సంజీవివంటిదని యుత్తరమిచ్చువారు కొందరుండిరి. తాఁటిచెట్టు భూకల్పవృక్షము, దానినార సేద్యగాండ్ర కెంతయో నుపయోగ పడున నెడివారు లక్షలుండ, తాఁటినార త్రాడుతో బావిలో చేద వేసినఁ బాప మింతంత గాదని బల్కువారు వేలకొలఁదిగనుండిరి. ఉండ్రాలతద్దెకు నుండ్రాలన్నింటిని నూఁకపిడిచేయువా రెందఱో యుండ, వానిని నైతమా దినమున ముట్టనివారు కొందఱుండిరి. దీపముండుచో కోటానుకోటులుగా క్రిక్కిరిసియుండు క్రిమిసముదాయము యమపురికేగునని జాలిఁజెంది, భానుఁడు పశ్చిమాంబుధి గ్రుంకకమున్నె తమ తమ పనులు దీర్చుకొని సెజ్జలకేగువారు కొందఱుండ, దీపమారిపోవుచో అన్నముతినుట నాపి పస్తుపడియుండువా రెందఱో యుండిరి. అన్నము నెమ్మదిగఁ దినుట మంచిదని నమమ నమమ కీర్తనలతోడను గాలము గడుపుచుఁ బొట్టల సవరించుకొనుచుఁ బుష్కలముగ బట్టించువా రెందరోయుండ, పురుషుఁడైపుట్టి కడిగిన కాళ్లారు లోపలనే యన్నము దినవలె ననెడివారు కొందఱుండిరి. కృత్తికాది నక్షత్రములలో నొక జీవి తనప్రాణమును గృహమునందుఁ గోల్పోవుచో నాగృహమును పాడుబెట్టి పరులగీములఁ జొచ్చుట పరమధర్మమని పెద్దలెందఱో యెంచుచుండ, యట్టి నక్షత్ర దోషముల నిసుమంతేనియు లెక్కచేయక యితరుల యిండ్లకేగుట కిష్టపడనివా రెందఱో యుండిరి. కొమార్తె

పుట్టినచో గొన్నివేలతోసహా యల్లుని నాపెను సాగనంపుటకు వలయు లాంఛనలతో తన కాపుర మడుగంటునేమో యని భయపడుచుఁ, గూలిచేసియైన బ్రతుకగల తనయులనే కోరు తండ్రులెందఱో యుండ, కుమారిక బుట్టుచో నే వృద్ధునకో నొసఁగి వేలుగడింప వచ్చునని కొమార్తెలనే గోరు తండ్రులీ యుర్విపై నెందఱో యుండిరి. ఆడుపిల్లలకు ఆవులను అరణముగా నిచ్చు జనకులెందఱో యుండ, పందిపిల్లలను, పాముపిల్లలను, కోతిపిల్లలను కొమార్తెల కొసఁగి కాపురములకుఁ బంపు తండ్రు లీపుడమిపై నెందఱో యుండిరి.

ఇన్ని యాచారములుండుచో దేశ మొక గమ్యస్థానముఁ జేరు టెట్లు! ఉన్నది ఉన్నట్లంటె తప్పులున్న క్షమించుఁడు. మనమిపుడు బెజవాడ చేరనున్నాము. అల్లదిగో స్టేషను. తమ యడ్రసు తీసికొంటినిగదా, ఈపేదవానిని యీలోకములో మరువకుఁడు. దైవాధీనమున మామిత్రమండలికి మేలు చేకూరుచోఁ దమ్మొకతూరి కలిసికొందును.

తాత:—నాయనా ! తాడి నెక్కువాఁడున్న దలఁ దన్ను వాఁడున్నాఁ డన్నట్లు, శ్రీనాథుని మించిపోయినావు తండ్రీ ! ఈరాత్రి మాయింటికడ నుండఁగూడదా?

అంతఁ దాతగారి చెవిలో సంజయుఁ డేమేమో యూదెను. ధూమశకటము కడుదుడుకుగ బెజవాడ స్టేషను చేరెను. సంజయుఁడు తాతగారినుండి సెలవు దీసికొను సమయము వర్ణింప నేరితరము!

సంజయుఁడు నేరుగ 10 గంటల బండిలో బందరులో దిగి, బండి కట్టించుకొని, బచ్చుపేటయందలి యొక సదనము సమీపించి "విజయా ! విజయా !" యని పిలువ ఆతుర ముతో సంజయునిచేరి, 'ఈబండికి వచ్చితివేమోయి" యని విజయుఁడనుచుండ, బండివాఁడు సూటుకేసును గదిలో బెట్టి డబ్బుదీసికొని చాలాకిగాఁ దనదారిపట్టె. అంత నీయిరువు రొక గదిలోకేగి ఏమేమో గుస గుస లాడుకొనుచుఁ

## నాల్గవ ప్రకరణము

రాత్రి 10 గంటలయ్యెను. బాదరులోని ప్రజలు తమ తమ పాన్పులనలంకరింప సిద్ధముగనుండిరి. విజయుఁడు తన గది యందేదో దీర్ఘాలోచనలో మునిఁగి యుండెను. ఆతని జనని యొకలేఖను దెచ్చి యతనికొసఁగి పోయెను. దాని నతఁడు విప్పి యిట్లు తనలోఁ దాఁ జదువుకొనఁ దొడఁగెను.

మంచెవల్లి,
15—12—30.

డియర్ విజయా !

దైవానుగ్రహమున మన పరిస్థితు లిచ్చట సక్రమముగా నున్నవి. నేను నీహితోపదేశ మెంతమాత్రమును మఱువ లేను. నేనిట కరుఁగుదెంచిన పిదప నొక గంగిరెద్దు వానితోఁ గలిసికొంటిని. వానికిఁ గొంత ద్రవ్యంబిచ్చి, కొన్ని క్రొత్త వస్తుల నొసంగి, కొంత రహస్యం బెరింగించి, యెద్దునకు వానికిఁగూడ వేషంబుదీయించి పెద్దబజాఱునగల యశ్వత్థ

వృక్షము కడబెట్టి "ఓ బసవదేవా! తండ్రీ! కలకాలమునుండి వచ్చుచున్న కడుపునొప్పి పోఁగొట్టితివా! దేశముల నుద్ధరించు తండ్రీ— నేనీ సేవఁజేసెదనయ్యా!" అని నేనెలుగెత్తి యఱచుచుండ, "అయ్యా! నిన్ను గణాసారిగాఁ దీసికొనుటకు ఆయన మహాత్తెం నీయందు చూపాడు. బసవసామి సామాన్యుఁడా! కొండలదిరిగాడు—అడవులసంచరించాడు—పెద్దపులితోఁ బోరాడి తుట్టతుదకు చంపి దగ్గరూరుకు దీసకొచ్చాడు. కలియుగాన బుడతాడన్న వీరవసంతరాయుడీయనే—సంతానము లేనివారికి సంతానము—ధనము లేనివారికి ధనము. కన్నులులేని వారికి కన్నులు కలుగజేస్తాడు—రోగాలు అంటఁగల్పుతాడు—సామి బసవదేవయ్య సామాన్యుడా! ఈ వూరోరు అదృష్టమతులు. అని వేషమువార్చిన గంగిరెద్దువాఁడు కేకలు వేయుచుండ, పొట్టల నింపుకొనుట కిదియే సమయమని యెంచి ముప్పది పలుగాకులు 'బసవయ్యా! బసవయ్యా!' యని గంతులిడుచు మాలోఁ జేర, జనులు గ్రిక్కిఱిసి సాంబ్రాణి పొఁగవేసి దండాలు పెట్టువారును — పసుపు జల్లువారును, పుష్పను దెచ్చువారును, ప్రాణాచరము పడువారును, నై పలురకములుగా ప్రవర్తించుచుండిరి.

మిత్రమా! మఱునాఁటినుండి చెప్పఁదరమా! పల్లెల నుండియుఁ, బట్టణముల నుండియు, దూరపువారును దగ్గఱివారును, కుంటివారును, గ్రుడ్డివారును, రోగులును, సంతానము లేనివారును, బండ్లమీఁదను నడకమీఁదను, రైళ్లలోను, ఇచ్చటికి వచ్చుచుండ మండవల్లి యంతయు మహా

పుణ్యక్షేత్రమో! యిట్లుండెను. అప్పుడే బసవద్వారం ఘాటగా కీసి క్రేములు గట్టి యమ్మువా రమ్ముచుండ, "సాంబ్రాణి, కుంకుమ, పసుపు" అని కేకలిడుచు సున్ని సైన్ని మొదలుగాఁగల చేతికోటుల్లు తయారై యుండ,-- కొత్తగ కోతలుగా కుంకుమలిడిన కొబ్బరికాయల రాసులు తగలఁబడుచుండ, ప్రాణాచరము బసువారు పడుచుండ, గంటా గలఁ జేయుఁడని కేకలు వేయువారు వేయుచుండ, దయ్యా ములఁబట్టి మేస్పు వా రేస్పుచుండ, పోఁగొట్టువారు పోఁగొ ట్టుచుండ, బసవదేవునికేప ప్రసాదముగ నెంచుచు తిను చుండువారు దినుచుండ, పంచిర మమృతముగాఁ బానము చేయువారు చేయుచుండ, పిల్లలదయచేయుమని ప్రార్థించువారు ప్రార్థించుచుండ, సభాపీఠముల నిలువఁబడి సాంఘిక దురాచార ముల నణఁగఁటఁ జేయవలెనని యుత్తరప్రజ్ఞలఁ గొట్టువారిట కరిఁగి యేమియుఁ జేయఁజాలక పోవువారు పోవుచుండ, నేను నబేణాలోని బొక్కసము లెక్కించుచుండ, నా మనం బెట్లుం డునో యూహించుమా !

ఇది యిట్లుండ, వైద్యులలోకెల్ల వన్నెకెక్కిన వెజ్జు ననియు, మంగళ గురువారములు మాత్రమె యోగదృష్టితో మందిడుదు ననియు నెట్టులో పట్టణమంతయు వ్యాపింపఁజేసితి. అంత బొజ్జయ్యగారిట యొకరిజట్టుల కొకరికి ముడివేసి యెం తయో ద్రవ్యము గడించి బాకీలఁ బెట్టుచుఁ బెద్దపార్టీదారుఁడై యుండుటచేఁ జాలమంది నాకడకరిఁగి బొజ్జయ్యగారిని జూడ వేడిరి. అంత మనపంట పండినదిగదా ! యని సంతోష

స్వాంతుఁడనై బొజ్జయ్యగారి యింటి కేఁగి చేయిఁజూచి, దీర్ఘ వ్యాధి యనియు, నాల్గువారంబులలోఁ గుదురు బాధ్యత నాదని తెలుపుచుండ, కమలను ఒక వనిత తీసికొనివచ్చి, "అయ్యా! ఈమెకు కొంచెము విభూతి పెట్టుఁడు—దడుచు కొన్నట్లున్నది—దిన దినాభివృద్ధిఁ గాంచవలసినది కృశించు చున్నది. మొన్ననె మదరాసులో వివాహమైనది. తండ్రి వ్యాపార తొందరలో తహతహఁ జెందుచు నిన్ననె పోయె" అన "అటులుండుచో మీరందఱు బయటకుఁ బొండు. దంపతులను మాత్రమె యిట నుండనిమ్ము." అని దెలుపగా నందరు బోయిరి. బొజ్జయ్య మన స్వగృహాలో లేఁడు. చిన్నతనమున నీతో కమల నొక్క తూరిమె జూచుటచే నాపె నన్ను బాగుగ గుర్తించలేదు. కమలకు మన వృత్తాంతమంతయు, నీదిగులును గూర్చి ఎట్లు చెప్పవలయునో యట్లు దెలిపితి. అంతనాపె ఎట్లు వెక్కివెక్కి యేడ్చెనో, ఏమేమి తలపోసికొనెనో తరువాత నేకాంతముగఁ దెల్పెదను. కమలకుఁ జెప్పవలసినదంతయుఁ దెల్పితి. ప్రతి మంగళ గురువారములు నేనిటకువచ్చి బొజ్జయ్యకు తగు మందిడుచుఁ గమలతో సంభాషించుచుంటి. కమల విమల చారిత్ర. ఆమె విషయమై నీవేమియు ననుమానము పడవలదు.

అతి త్వరితముగ సుందరుని యర్ధాంగి యగు సంతోష మును లేఖద్వార ఇటకుఁ బంపుము. గంటలకొలఁది పురుషుఁడు స్త్రీతో సంభాషించుచో నేదో యనుమానమున కవకాశ మేర్పడునుగదా! సంతోషము వచ్చుచో సంతసముతో

నీపని నిముసములో ముగించగలను. మండవల్లి పరిసరమున పనసమామిడి మొదలగు తోటలు లేకపోయినను, సరివి త్రోపులు లెక్కకు మిక్కిలిగా నాకసము నంటనున్నావా యన్నట్లొప్పారుచుండెను. ఇవి మనకెంతయో తోడ్పడు చున్నవి. వీనికి చేరువనె మన బందరు కరుగు రోడ్డుగలదు. అచ్చోటనె మన బసవాశ్రమము నిర్మింపఁబడెను. రైలు స్టేషనునకు నీశాన్యముగ నన్నూరు గజములలో నిదిగలదు. కాన ఆమెను వెంటనే బంపుము. నేను సంతోష కమలలను గలిసి ది 4-1-31 బెజవాడ రాత్రి 4 గంటల బండికి వచ్చెదము. మనము స్టేషనులోగాని, నీకిదివఱకు దెలిపినట్లు బెజవాడలో ఇస్లాముపేట అంకమ్మగారి యింటియందు కలిసి కొనినను సరియె. బాజ్జయ్యగారి కిచ్చిన గడువు సమీపించుచున్నది. కడు చురుకుగఁ బనిచేయుము. దిగులు విడనాడుము. ఈశ్వర కృపచే మన కెల్లయెడల జయమే ప్రాప్తించుఁ గాక. ఎవరో విభూతి గైకొనుటకు నాకొఱకై వేచియున్నారు. కాన విరమించుచున్నాఁడను. కడు జాగరూకుఁడవై యుండుము.

బసవాశ్రమము, మండవల్లి. } ఇట్లు మీ ప్రాణమిత్రుఁడు, సి. సంజయుఁడు.

ఇట్లు చదువుకొని విజయుఁడు తనలోఁ దానవ్వుకొనుచు నేమేమో నాలోజించు కొనుచుండె. వెంటనే బల్లపైఁ గల కాగితమును దీసి లేఖను ముగించెను. దీని నెచ్చోటికిఁ బంపుచుండెనో వేఱు దెలియఁజేయవలయునా !

ఐదవ ప్రకరణము.

సుం:—ఏమియు లేదు, మగని మాటను మీరిన మగువ యొక్కతె కాయమంతయుఁ గందునట్లు గసిదీరఁ గొట్టిన భర్త బాధ భరింప నోర్వలేక బావిలోఁ బడఁగా నట యెవ్వరో రక్షించిరఁట. ఇంతకంటె వింతలైన వార్తలీ వార్తాపత్రికయందు గలవా !

సం:—నాథా ! మన భరతఖండమున దాదాపన్ని సంఘములలో స్త్రీకి స్వాతంత్ర్య మొసఁగక యెన్నియో విధముల నేడ్పించుచుంటిరి గదా !

సుం:—సంతోషమా ! ఈ స్త్రీపై నీవుచూపు సానుభూతికి సంతసించితి. కాని ప్రతివిషయమున విమర్శ ప్రధానముగదా ! ఆమెయం దెట్టిలోపము గలదో ! అన్నట్లు, ఆంధ్ర పత్రికయందు 'మగనిమాట మీరు మగువ యను శీర్షిక క్రింద నీపె చారిత్రము వ్రాయుచుండ వేరె చర్చయేల? మీ స్త్రీలపని యింతకు దిగినది.

సం:—నాథా ! ఏమి ! ఆ పక్షపాత బుద్ధి; ఆపెయం దేమి లోపము గలదో యందురుగాని యాతఁ డెట్టివాఁడో యన రేల ? అతని చరిత్ర మీకంత పవిత్రమైనదిగాఁ దోచినదా ! పురుషులఁ బొగడుట, స్త్రీల సులభముగాఁ జూచుట, తమకుగ్గు బాలతో వచ్చినదియే గదా ! పోనీ ఎవ్వారివిషయమో మనకేల, మన మెఱిగినంతవఱకుఁ దమ మిత్రమండలిలో నర్థాంగు లన్నము వడ్డించుచుండ భర్తలు భార్యల కనుదినము దెబ్బలు వడ్డించు వారెం

దఱు లేరు! కటకటా! మా బాధ పంచభూత
ములు సైతము పరికింప లేకున్నవి గాని యెన్నియో
తరములనుండి మీకు మాపై జాలి లేదయ్యెను.

సుం:—మా తాతముత్తాతల కాలములో జాలిచూపక పోయి
నను ఇప్పుడేమి యీయలేదు. ఇంక యేమి యివ్వ
వలయును.

సం:—అట్లనెదరేల, వారివ్వని స్వాతంత్ర్యమేది? మీ రిచ్చిన
దేది?

సుం:—ఎట్టి స్వాతంత్ర్యమా! మనపల్లెటూళ్లలోని పెద్దలం
దఱు బజారులకు వచ్చునపుడు పన్నుకట్టులఁ జేఁబూని
నను— తాళపుచేతుల గుత్తి క్రొత్తఫేషను ప్రకారము
బయటకుఁ గాన్పించునట్లు ఆడువాండ్ర రొండ్ల నలం
కరించును గదా! ఆంధ్రపత్రిక చదువుచు హడావు
డిగ నటునిటు తిరుగవేయుచు, నేమేమో బజారులలోఁ
వెల్లుచున్నను, పత్రికకుఁగాని పేదవిద్యార్థి విద్యకుఁ
గాని చందానివ్వవలయునన్న వారము రోజులనుండియే,
భార్యను మంచి చేసికొనవలయును గదా! నలుగురు
స్నేహితులు వచ్చిన గొబ్బున వంట తయారగుననెడి
యాశ లేదుగదా! కడుపులో నొప్పి ప్రారంభించినది,
కదులుమా! గుంటూరనిన తట్టబుట్ట నెత్తిన వేసికొని
నాటుట మొదలుకొని కోంతలవఱకు వచ్చు సామ
గ్రితో, మేకపాటి యక్కమ్మకియ్యవలసియుండు ఇంటి
యద్దెలతో, ఇంజెంక్షన్ను, డాక్టరు ఫీజు — పండ్లు,

ఫలహారములకు, సినిమా డ్రామాలకు వలయు ద్రవ్యమును అప్పొసొప్పొ దెచ్చి, దాసానదాసులమై, పదండమ్మా గుంటూరని బండ్లతోఁ దయారు కావలసినదే గదా! కష్టపడి సంపాదించిన ధాన్యమును చాటు పేరగాండ్రకు సగానికి సగము విరుఁగఁగోసి యమ్మక, తిరుణాలలు యాత్రలని మమ్ము వేధింపక, తూరుపు పొలము తాకట్టుపెట్టి నగలు చేయింపుమని నాగనాచి యేడ్పు లేడ్వక, నాలుఁగు గేదెలపాడి యేమిచేసితిరనిఁ దిరుగమూఁతల కేమి వాడవలెనని తిరుగు జవాబులు చెప్పుచు, మా కొంపలు ముంచుచు మారువాడీల పాలుచేయక, టక్కులోగాల మాటఁగలిపి, కలిగినది వండిపెట్టుచు మాయెదుట కబురులు చెప్పుచు, విదేశ పరిశ్రమముల పారదోలు పరమపవిత్రమగు రాటమును నోడలువంచి యనుదినము ద్రిప్పుచుండిన చాలు. మీరు మాకు స్వాతంత్ర్య మిచ్చినట్లే. నీవనిన నీవే గాదు సుమా! స్త్రీ జాతి సునీ!

సం:— నాథా! బాధకు తాళఁజాలక బావిలోఁ బడిన భామనుగూర్చి చదువ, విచారము నొందితినేగాని యా మెను వెనుక వేసికొని రాలేనుగదా! ఏల స్త్రీలపైఁ దమరట్లు ధ్వజమెత్తుట. ఉదయముననే కాఫీలు, మధ్యాహ్నము ఫలహారము సాయంకాలము 'టీ' తరువాత సినిమాలు; వేశ్యల యిండ్ల కెక్కి పట్టణ మంతయుఁ గంట్రాక్టు దీసికొన్నట్లుగా ప్రతిబజారు

దిరుగుచుఁ బట్టనమెక్కి తలవాయు వడ్డీలతోఁ బ్రాం శరీనోటుల వ్రాసి — చెప్పరాని వ్యయములు చేసి వేలతో అల్లుంద్రను గొని యింద్రవైభవముగఁ బెండ్లిండ్లుసేసి దివాలుదీసి మీరు మారువాడీల పాలగు చుండ మాకు సిగ్గగుచుండెను. మీరనగా మీరు గాదు, పురుషజాతి సుమీ! నే నడిగినది యొకటి. మీరు దించినది వేఱొకటి.

సుం:—పోనీ! మాపైననే ధ్వజమెత్తితివిగదా! ఆ అసతే మిటో దెల్పుమా!

సం:—ఏమా! భారతదేశమందలి కొన్ని సంఘములలో స్త్రీలకు సతతము రవికలుండగూడ దనియు, వేరొక సంఘములో విధవ యగుచో రవిక దీసివేయవలయు ననియు, మఱియొక సంఘములో మగఁడు మృతి నొందుచో క్షౌరము చేయించుకొనవలయు ననియు, కొండొక సంఘములోఁ గోమలాంగుల గాజుల చప్పుడు పురుషుల చెవిఁ బడఁ గూడదనియు సిద్ధీకరించి తగు సాధనములఁ గనిపెట్టి, రజస్వలానంతరము పాఠశాలలకుఁ బోయి బాగుగ విద్య గడించు బాలికల విద్యనాపుఁడల చేసి, లోకానుభవమెట్టిదియో తెలియనీక, ప్రకృతి నైజమును బరిశీలించుట కెట్టి యవకాశము నొసంగక, పెట్టరానిబాధలు మా స్త్రీ సంఘమునకుఁ బెట్టు మీ పురుషజాతి కమపాపమును వడి గట్టుకొను చున్నదిగదా!

సుం:— సంతోషమా ! నీవు దెలిపిన దంతయు యదార్థము. అం దనృతం బావంతయు లేదు. ఘోషా మొదలగు ప్రాచీన పద్ధతులఁ దీసివేయ నాయకు లెందఱో యత్నించు చున్నారు. ఇకార్యము బూనుటచే రాజ్యపదభ్రష్టులైనవారు సైతముగలరు. స్త్రీ స్వాతంత్ర్యమునకై యెన్నియోవిధములఁ బాటుపడుచున్నారు. వితంతూద్వాహ మన్న వెనుదీయక వేగిర పడు చున్నారు. కొలఁది దినముల క్రిందటనె వచ్చిన విజయుని లేఖను చూడలేదా ? కమలా విజయుల పాణిగ్రహణమునకే యిపుడు పోవుచున్నారము.

సం:—ఏమి ! అంతపుణ్యమా !

సుం:— మనసున బెట్టుకొనుము. తగుకాలమున నంతయు దెలిపెద. ఇదిగో ! స్టేషను సమీపించుచున్నది.

బండి బందరుస్టేషనుకు రాత్రి 10 గంటలకుజేరెను. ప్రయాణీకులు బండిదిగ్గి తమతమ వస్తువులఁ దీసికొని బండ్లు గట్టించుకొని పోవుచుండిరి. కార్యస్థుఁడైన విజయుఁడు సకాలమునకు స్టేషనుకు రాకుండునా ! అతఁడు సంతోష సుందరుల పొంతకుఁబోయి యేమేమొ గుసగుసచెప్పి బండిలో నెక్కించుకొని, యింటిదనుక సుందరునితో మాటలాడుచు వచ్చెను. సంతోష సుందర విజయులు నిజసదనమునకుఁ జేరి బండివానికి ద్రవ్యంబిచ్చి పంపి, సంతోషమునకొక ప్రత్యేకపు గదినిచ్చి వీరిరువురుసంభాషింపమొదలిడిరి. "మాతండ్రి కాకినాడకుఁబోయెను. అన్నకూఁతురన్నఁగొంచెమామె కిష్టమేగదా!"

యని విజయుఁడన సుందరుఁడపరిమితానందభరితుఁడై "విజయా! నీవువ్రాసిన లేఖయందలి యంశముల నన్నింటిని గమనించి తిని. నీవు కడుచుఱుకుగఁ బనిచేయ వలయును. కమల విమల చరిత. తండ్రిమాటనిటపాటింపకుము. రాజాధిరాజులు రాజ్య మేలఁగా నొక గ్రుడ్డిగవ్వయైనను దీసికొనిపోఁ గలిగిరే! నీవే దాతవు, తండ్రివి, గురుఁడవు, ప్రియుఁడవు, సర్వస్వము నీవే" అని నమ్మిన యబలయగు కమలను వీడి, తండ్రి యేమనునో! కులము వారేమందురో! శాస్త్రములు సమ్మతించునా! యని దిగులుపడి వేఱొకకన్యను చేఁబట్టితివా, పిఱికిపందవై, యామె యుసురు గట్టుకొని, మూఁడేడు తరములామె యింటికడ కుక్కవై బుట్టెదవు. శాస్త్రములు సాకేల ? పోనీ, పురాణ ములు ప్రధాన గణనీయము లందురా ! మంచిది. అంబ అంబాలిక లెవరు ? వారు వితంతువులు గారా ! కౌరవ పాం డవ సంతతి వీరిదిగాదా ! అది యటుండనిమ్ము. విశ్వా మిత్రుఁ డేజాతివాఁడు ? మేనకేజాతికన్య ? వీరిరువురకుద్భవిం చిన శాకుంతల యెవరు ? ఈపెకు జనించిన భరతుఁ డేజాతి వాఁడు. ఈతని సంతతియేగదా మన భారత భాగధేయము. కాన మతిహీనుఁడు సైతము మనము మెట్టు మార్గము మంచిది గాదనఁ గలఁడా !

వేయేల, నీవుమట్టుకు సామాన్యుఁడవా! కళా 'లల యందు చదివి యుత్తీర్ణుండవై పట్టభద్రుఁడవైతివి. పలు గ్రంథములు చూచితివి. వీరేశలింగము గారిని వేనోళ్ళ శ్లాఘించు చుండెదవు. న్యాయము పాటింప

హిందూశాస్త్రము లక్ష్యవచ్చుచో బంగాళా ఖాతములోఁ గట్ట గట్టి పారవేయుఁడని పనికిన మోతిలాలుగారిని స్మరణకుఁ దెచ్చుకొనుము. విమలయగు కమలను బెండ్లాడి, కన్నులారఁ జూచుచు సంతోష సాగరమున మునిఁగి నీ యిష్ట మున్నంతదనుక నీదులాడుము. నిన్ననువారెవరు? ఉద్యోగివై యెంతయో ద్రవ్యంబు గడించుచు, హంసతూలికా పాన్పులపైఁ బరుండ, కమలాదేవి తమను "నాథా! అన్నము నకు రండు" అని బిలుచుచుండ, ఆమె యమృతభాషణల, సువర్ణ దేహమును, మందహాస గమనమును మదినెంచుచు మమ్ము మరుతువు గదా! గంగిరెద్దువానితోఁ బాటు గంతులు వేయు సంజయుఁడు, అర్ధాంగితోసైత మిటకరుదెంచిన నేను జ్ఞప్తికి వత్తుమే! కమలా! కమలా! యని కలవరించుట దప్ప వేరుండునే!

మిత్రమా! యిట్టి తరుణము త్వరితముగనే లభించుఁ గాత. మీకు దిగ్విజయము చేకూరుఁ గాత! సంజయుని కమ్మను జూచితి. రేపే సంతోషము మండవల్లి కేగవల యును. నేను మీ వివాహంబునకై బెజవాడలోఁ దగు నేర్పాట్లు రేపటినుండియే చేయువలయును. మిన్నకుంటివేల? ఆనందమా! రెండవదియా! పెండ్లన్న యెంతటివానికై నను సిగ్గు గలుగకపోదు. పోయి పరుండుము. చాల ప్రొద్దు పోయినది" అని సుందరుఁడు పలికి తన పాన్పునకు చేరెను.

## ఆరవ ప్రకరణము.

కమల నాటిరేయి విజయునే దలచుకొనుచు బరుండి యుండెను. అంత నర్ధరాత్రము నాతఁడామెకుఁ బ్రత్యక్షమై ట్లుగా నెంచి యిటులేమేమో బలుకుచుండెను.

" అనవరతము నబలల ననుమానించు పాడుబుద్ధి యీశ్వరుఁడేల మీ పురుషజాతికిఁ బెట్టె ! బావా ! విజయా! నారాజా ! పట్టభద్రుఁడ వైతివిగదా ! ఆంగ్లకవితా పితామహుండగు షేక్సుఫియర్ గారి నాటకాంశములు భవదీయ మనోవీధిని పరుగెత్తించితివి గదా ! వానినెల్ల విస్మరించితివా! రతము నిజనాథుని నమ్మి యత్యంతమతఁడే తన బంగారు కొండయని భావించుకొను డెస్డిమోనా యొక్క వధను మరచితివా! మద్యపానముచే మతిల్లి యొడలెఱుంగక కూసిన రజకుని కూఁతలే ప్రధానముగ నెంచి, పరమ సాధ్వియు నిందు మూలాలునగు సీతను రామచంద్రుఁడు ఘోరారణ్యములకుఁ బంపుట ఘోరపాపమని నుడివితివిగదా ! దూరదృష్టిలేక స్త్రీలను దూషింపఁగూడదని పల్కుచుండెదవు గదా! వీని నన్నింటి నేమంటఁ గలిపితివి?

బావా ! పంచకావ్యములు చదివి ప్రపంచజ్ఞాన మెంతయో వడసి ఎందఱో సభ్యులఁ దనముద్దుముల్కు మాట లచే రంజింపఁజేసి, సంస్కరణలన్న సంతసించు కమల తననొక వృద్ధునకుఁ గట్టిచూడ తత్కాలమున తలిదండ్రుల నెదుర్కొనుటకు మారుగాఁ దలవంచుకొని యుండఁ దగునా ! యని యనవచ్చును. బావా ! యిట నమ్మ

కయే ప్రధానము. ఆత్మసాక్షిగఁ దెల్పెద. నాతండ్రి తన మిత్రుని ముద్దుతనయ పాణిగ్రహణమున్నకై పెండ్లిపనులు చేయవలయునని ప్రేరేపింప, నా జననియు నేనును బనులలోఁ బాల్గొంటిమి. రెండుగంటలకు బెండ్లి కానున్నతఱి నన్ను తోడు పెండ్లికూఁతురుగ నుండుటకుఁ దోడ్పడుమని వేడిరి. అంతఁ దమయాజ్ఞ లేదుగదా! యనియుఁ జిన్న బాలికనుగాదు గదా! యనియు, నందుల కంగీకరింపకుంటిని. ఇంతలో నెవరో యొక తల్లివచ్చి "పిచ్చిదానా! నిన్నే యొక వృద్ధునకుఁ గట్టనున్నారు" అని చెవిలోనూది మఱుమాయమై పోయె. బావా! అంతనేమూర్ఛిల్లితి. నా తల్లియొక మూల దిగాలు పడి మూల్గు చుండెను. పెండ్లిండ్ల పేరయ్య యఱపులు మాత్రము నూఁతిలో మాటలుగా వినఁబడె. మిత్రమండలికి సైత మిది తెలియదు. పేటలోని వారికి మాత్రము తెలిసెనా! లేదు — అంతయు మోసము — మోసపు పెండ్లి యయ్యె — ముద్దులబావ దూరమయ్యె. ముమ్మాటికిది మా తండ్రి పేరాశకు మూలమని గుర్తింపుము.

పెండ్లియైన పిదప నత్తవారింటికి వచ్చుట, యిట నింత కాలముండుట యేల? యని ప్రశ్నించుచుంటివా! మంచిది. బొజ్జయ్య కొలఁది దినములలో దివికేగునని నాకు బాగుగఁ దెలియును. అటుపై వీరేశలింగముగారి సిద్ధాంతమును బట్టి తమ్ము వివాహమాడిన ప్రజలు సమ్మతింతురనియుఁ దెలియును. కాన నటించుచున్నదాన. నటనయనఁ గుట్రయం

దురా? కాదు! కాదు! ముమ్మాటికిఁ గాదు. తమ ప్రతిష్ఠ నిలుపుకొనుటకు మగువలెందఱు నటింపలేదు.

మోసగించి అల్లాయుద్దీను నుద్వాహమాడెదనని యాస బెట్టి, రాజపుత్ర శేఖరులతోఁ బల్లకీలలలోఁ బోయి భర్తయగు భీమసింగును దప్పించిన పద్మిని జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు. తన నాథుని మిత్రుని ప్రాణరక్షణార్థము పురుషవేషమున న్యాయవాదిగ కోర్టుకేగి, కడు చమత్కారముగ వాదించి, ఆన్టోనియను రక్షించిన పోర్షాను గుర్తించుము. వీరియం దావంతయైన లోపంబుగలదా! వారికోరికలు గట్టెక్కలేదా! అది మోసమా! దీర్ఘాలోచన లేకయే తమకడకు పరుగిడివచ్చి యుండుచో, లోకమేగాక మనయిరువురి తలిదండ్రులు సైతము దగ్గఱకు రానిత్తురా! చెట్టాకుల పక్షులమై పోయెడివారము గదా! ఇప్పుడన్ననో, బొజ్జయ్య భువి విడఁగానే సిద్ధాంతము ననుసరించి వివాహమాడవచ్చును గదా! నీసంగతంతయు సంతోషము చెప్పుచున్నదిలే!

బావా! దయలేదా! పలుకవేల! తలిదండ్రులకు భయపడుచుంటివా? నాది నేరమా! సంజయ సుందరులతో మిన్నకున్నట్లు నాతోఁగూడ పలుకవా? ఉద్యానవనమందలి మాటలు మరచితివా?

## ఏడవ ప్రకరణము

అక్కటా! నేనిపుడు క్లిష్ట పరిస్థితులలో జిక్కుకొంటి. ఈ తెల్లవారి జాముననె మండవల్లి వదలి బెజవాడ పోవలయు

నని సంతోషము మఱిమఱి తెలుపుచున్నది. "నీవును సంతోషమును దెల్లవారి జామున నాలుఁగు గంటలకే బయలుదేర వలయును; నేను ప్రయాణమునకు సిద్ధుఁడనై మీ యింటి కీశాన్యమునఁగల చిక్కుడుచెట్టులో నుండెద. నన్ను గలిసికొనిన మనము మువ్వురము గోవాడవారి సరివితోపులో గల మారుమార్గమున స్టేషను చేరవలయును" అని సంజయుఁడు చెప్పుచుండెను.

ఏదిగొప్ప ? తాలిబొట్టు గట్టి కొలఁది నిముసములలో దివికేగనున్న ముసలిభర్తయే శరణ్యమని యిట పడియుండు టయా? లేక 'బావా! భూమ్యాకాశంబులు గమనించుచుండ, నిట వృక్షలతాదు లాలకించుచుండఁ గమలయనెడి యీ యబలకెట్టి యిక్కట్లు సంప్రాప్తించినను బావయగు విజయుని మరువదు. విజయునిదే యాత్మాయత్తమగు ఈ శరీరము" అని చల్లని పిల్లగాడ్పులు వీచుచుండ నాఁటి యుద్యానవనంబులో మల్లెపూదండ మెడవైచి, బావయగు విజయుని కొసఁగిన వాగ్దత్తము నెరవేర్చుటయా ?

పతి పరలోకగతుఁడు గానున్నతఱి విషనాడిపోవఁ గడుగడుసుదనియు, ముసలివానికిఁ గాపురము చేయవచ్చెనా యనియుఁ బ్రజలు పరిపరివిధముల దలఁపరా! తల్లిదండ్రులకుఁ దలవంపులు గాదె ! అబలయగు తల్లి నటుండనిమ్ము. ధన కాంక్షచే మదీయ స్వసౌఖ్యమునుగూర్చి కించెత్తైనను మది నెంచక నన్నీవృద్ధునకుఁ గట్టిన తండ్రియగు నాతఁడు నాకు దండ్రియె ! యౌవనప్రాయమున అనుభవింపఁగల సంసార

సౌఖ్యముల ననుభవింప నెట్టియవకాశమును లేక, భానుఁడు పశ్చిమాంబుధి దుముకకమున్నె ధమ్మిల్లము దువ్వుకొని కుసుమంబు లిడుకొని నిలువుటద్దములోఁ దన ప్రతిబింబము చూచుకొనుచు, నాథునకుఁ దన నిజ సౌందర్యమును జాబిల్లి వెన్నెలలో, శయ్యాగృహములోఁ జూపుటకు నోసికొనక, సన్యసించినవారి చందమున, బైరాగులభంగి, కాషాయి వస్త్రములఁ దాల్చి కందమూలాదుల గహనములలో గైకొనువారి కైవడి, విరాగులవోలె, మతిహీనుల మాడ్కి, నెవ్వియో మొద్దుచీరలఁ దాల్చి దిగాలుపడి దినదినము కృశించుచు "మాకీగతి ప్రాప్తించె గదా!" యని మదిని దిగులుచెంది తమతమ ముసలిభర్తలకు లోకి మేమనుకొనునో యని వెఱచి కాళ్లు పిసుకుచుఁ దగుసేవఁ జేయుచుండ, కూతుండ్ర నమ్ముకొనిన ద్రవ్యంబుచే నింటఁ గులుకుచు, వ్యాపారముననో వ్యవసాయముననో, వేరొండు పనులనో చేసికొనుచు, పరమాన్నమాది భక్ష్యంబులనెల్ల భక్షించుచు నిరతము తమ స్వసౌఖ్యములు చూచుకొను తండ్రులీ భువియందుండిననేమి? గిట్టిననేమి? అట్టివారు దండ్రులా! లేక రాక్షసులా! రాక్షసుఁడననొప్పు నా తండ్రికిని నాకును గల సంబంధమేమి! నా ముద్దుల బావయే నాకు శరణ్యము. ఎన్నియో వెతలకు లోనైన భర్తృసేవా తత్పరులగు భామలీ యవనిలో లేరా! యని ప్రజలనవచ్చును. నా ముద్దుల బావయే నాభర్త— నా దాత — నా బంగారుకొండ — నా సర్వస్వము— కాన బావయే నాకు శరణ్యము. నా శరీరమంతయు ఆ నాఁ

దుద్యానవనములో విజయుని ప్రేమలతకే విక్రయించితి. కాన నాశరీరముపై నాకెట్టియధికారముగలదు. ముసలిమగఁడులభించుట-అత్తవారింటికి వచ్చుట-కొంతకాలము పతిసేవచేయుట-జూడనంతయుస్వప్నముగాఁగాన్పించుచున్నది. నిజముగనంతయు స్వప్నము. నిద్రనుండి మేల్కాంచితిని. ఇదిగో! బావను జూడఁబోయెదను." అని కమల తన్మయముఁజెంది విజయుని స్మరణకుఁ దెచ్చుకొనుచు చిక్కుడు చెట్టుకడకుఁ బోవుచుండెను. తెల్లవారనుండెను. ఘల్లుమని యింటఁగల బోడెమ్మలు గొల్లుచేయ, కొందఱు బొజ్జయ్యా! బొజ్జయ్యా! యని యేడ్చుచుండిరి. కొందఱు సంతోషముతో పాటు ఇనుపపెట్టెలోని ప్రాంశరీనోటులను సైతము రొండులఁ బెట్టుకొనుచు, కుదువఁబెట్టఁబడిన నగలనుసంగ్రహించుచు, ఏమేమో వెదకుచు మధ్యమధ్య బొజ్జయ్యమీఁదబడి యేడ్చుచుండిరి. బొజ్జయ్య యమపురికిని, విజయుని మిత్రమండలి విజయవాడకును నొకేతూరి పయనమైరి.

సంతోషము, కమల, సంజయుఁడు గంగిరెద్దు గంగయ్య గోవాడవారి గొప్ప సరవిత్రోఁపులలోఁగల పెడమార్గములఁబడిరి. గంగిరెద్దువాఁడు బసవాశ్రమమునుండి సంపాదించిన ఐదు వేలరూప్యములు నోట్లతో చిల్లరడబ్బులతో ముక్కిముక్కి మోయుచు దారిఁ దీయుచుండెను. కనుమేరచూపులో నలుఁగురు తమ్ము సఫలీకృతమనోరథులఁ జేసిన బసవాశ్రమంబునకు కడసారి నమస్కారమొనర్చి రైలుస్టేషను కెటులఁ బోవుచుండిరో వర్ణింపనెవరితరము!

# ఎనిమిదవ ప్రకరణము

విజయుని మిత్రమండలిలోఁ గమలా విజయుల వివాహముఁ గూర్చి కలవరింపనివారు లేరు. అట్టి నేస్తగాండ్రు నేఁడు పాణిగ్రహణమన్న పరుగిడకుందురా! స్నేహితులెల్లరు అంకమ్మగారి యింటిలో హాజరైరి. కొందఱు పందిరికిఁ దోరణములు గట్టుచుండ, మఱికొందఱు వాద్యంబులు బాగుగ వాయించుచుండుడని పనివాండ్రమీద గ్రుడ్లురుముచు పెండ్లిపెత్తనము చెలాయించుచుండ, గంగిరెడ్డి గంగయ్య ఘనులకుఁదగు స్థానములు చూపుచుండ సంతోషసుందరులు స్వదేశి దుకూలములతో వధూవరుల నలంకరింపుచుండ, సుజయుఁడు వంటకు వలయు సామగ్రి తెప్పించుటలో కడు శ్రద్ధపూని వంట చేయించుచుండ, గౌడకులజులగు అంకమ్మగారి సతియు, పిల్లలతోసహా పెండ్లిపనులలో మునిఁగియుండ, వితంతూద్వాహమగుటచే, వింతగనో వెఱ్ఱిగనో చూచుటకు ఇస్లాముపేటలోని వారేగాక నితరులు సైతము వేనకువేలు వచ్చుచుఁబోవుచుండిరి.

ప్రాతఃకాలమున 10 గంటలయ్యెను. పలు ప్రదేశములనుండి మిత్రులెందఱో బండ్లకు దిగిరి. మిత్రులు దప్ప బంధువు లిట్టివివాహములకు వత్తురా! అది నిర్వివాదాంశము. నేఁడు వాద్యంబులధ్వని మిన్నుముట్టుచుండెను. కమలావిజయులఁ బీటలపైఁ గూర్చుండఁ బెట్టిరి. అంత మన తాతగారు తగుమంత్రములతోఁ బెండ్లి నడుపుచుండ, నమ్మలక్కలలోఁ గొంద రీడు జోడులఁ గూర్చి సంతసించుచుండఁ, గొందఱు 'ఏమి! వీరి మోహము! వీరి ధైర్యము!, అని అచ్చెరువొందు

చుండ, తల్లిదండ్రులు రాఁకపోయినను సంతోష సుందరులు, సంజయుఁడు, గంగిరెడ్డు గంగయ్య, కన్నులార వధూవరులు తలఁబ్రాలు పోసికొనునప్పుడు చూచుచు నానంద భాష్పములు విడచుచుండ నటఁగల పెద్దలాశీర్వచనములతోఁ బెండ్లి యయ్యెను.

నాఁటి సాయంసమయమున ఐదుగంటలకు విజయుని మిత్రమండలి కృష్ణానదీతీరమున నిసుకతిన్నెలపై నల్పాహారముల నారగించెను. అటుపైఁ దాతగారి యధ్యక్షతక్రిందఁ గమలావిజయుల విజయమును గూర్చి వీరిట్లు మాట్లాడఁ దొడగిరి.

సంజయుఁడు:—తాతగారూ! మిత్రులారా! నేఁటికి మన కష్టము లీడేరినవి. చీఁకటి కొన్నాళ్లు వెన్నెల కొన్నాళ్లను నార్యోక్తి మన జీవితములలో సరిగ నొప్పినది. ఈ కమలా విజయుల కల్యాణమునకై నేఁ బడినపాట్లు భగవంతున కెఱుక. మండపల్లిలో బసవాశ్రమమును స్థాపించితిని. నిజమగు వెజ్జునని తెలియఁబఱచుటకు నెంతయో నటించితిని. విభూతిఁ బెట్టెదననియు, దయ్యములఁ బోగొట్టెద ననియుఁ బ్రజలెందఱినో మోసగించితి. ఇట నే దేశమంతటిని మోసగించితినని మీరెంతమాత్రమును భావింపఁగూడదు. ఫలసస నా మోసపు టాశ్రమ మిపుడు గబ్బిలములకు నివాసస్థానమై యొప్పుటచే భారతీయులకు మోసమన నేమియో తెలియ పఱచితిని. ఇఁక వారెన్నఁడు మోసము చేయు వారి మోహమైనఁ జూడరని నాదృఢవిశ్వాసము. కాన దేశమునకు సేవఁ

జేసితినేగాని కీడు సేయలేదు. అది యటుండనిమ్ము. కమలతో మన రహస్యము, మనమిత్రమండలి కార్యక్రమవిధాన మెఱింగించుట కెంతయవస్థ బడితినో ఈశ్వరున కెఱుక. సంతోషకమలులకై చిక్కుడుచెట్టులో దాగియుండినపుడాపరిసరముననే పరుగిడిన పాము వాతఁబడియుండెడి వాఁడనే. అట సర్వేశ్వరుఁడు రక్షించెను. లేనిచో నీ సమావేశమున నన్నుఁ గాంచలేక యుండెడివారే! మండవల్లిలో సవిత్రోపులలో నుండి తప్పించుకొనునపుడు చెప్పులు గట్టువాని కుక్క మొఱుగు చుండ, బయటఁబడెదమేమో యని భయపడిన విధము సంతోషకమలులకే తెలియును. బెజవాడ వచ్చుదనుక మారువేషంబులతో సంతోషకమలల రప్పించుటకుఁ బడిన యవస్థ నింతయని చెప్ప నలవిగాదు. ఇన్నియేల! యీశ్వరకటాక్షముచే నిడుముల నన్నిటిని గెలిచితిమి. ఇంత ప్రయత్నించినను మన హితోపదేశమును విజయుఁడు లెక్క చేయక పోయినచో నంతయు వ్యర్థమయ్యెడిదె. కాన తల్లిదండ్రులను, శ్రేయోభిలాషులను సరకుకొనక మన మార్గమున మెట్టి, కమలను వివాహమాడిన విజయు నిటఁ గొనియాడుట మన కర్తవ్యము. బొజ్జయ్యను మాదాచేఁ జంపితినని కొందఱపోహ బొందుచున్నట్లు వింటిని. అదికల్ల. వృద్ధుఁడగుటచే క్షీణించి పరలోక గతుఁడయ్యెను. నాకును తాతగారికిని పరిచయము గుదిరిన పిమ్మట బెజవాడ స్టేషనులో గుసగుస చెప్పినది, ఈ వివాహమున కిట్లు తోడ్పడిన యీ తాతగారిని, మనకుఁ గళ్యాణమునకు గృహమొసంగి యెంతయో చేయూఁత

నొసంగిన ఈ అంకమ్మగారిని, నేఁ జెప్పినట్లుచేసి జాయింటుగా నైదువేల రూప్యములు సంపాదించిన యీ గంగిరెడ్డు గంగయ్యను, మనము మన జీవితములో మరువఁ గూడదు. మేము బసవాశ్రమములో సంపాదించిన ఐదువేల రూపాయ లుచితముగా మన మిత్రమండలి ధననిధి కొసంగు చున్నాము. ఇందులకు గంగయ్య అంగీకరించుటచే నతనిశీల మెట్టిదియో మీరే గ్రహింపుడు. నేను దారపుత్రాదుల వదలి దాదాపొక మాసమై యుండెననెడి విషయము మీకందఱికిఁ దెలిసినదే. రేపే నేను నాయుఁడుపేట కేగవలయును. కొలఁదికాలము సంతోష సుందరుల దంపతులు కమలా విజయులతో నంకమ్మ గారియింటియందుండఁ బ్రార్థితులు. వారలకుఁ గొత్తయనియు సిగ్గనియు కాదు. అట్లుండుట మంచిది. (నవ్వు)

సంతోషము:—మిత్రులారా! మాకు వాటిల్లిన కష్ట ములఁగూర్చి సంజయులే దెల్పిరి గాన నేవివరింపఁ బనిలేదు. మేము బందరునకు బయలుదేరునపుడు మార్గమధ్యమునొక మగువ మాటలమీఁదదప్ప ప్రథమమున కమలా విజయుల పెండ్లి కేగుచున్నామని నాభర్తగారు నాతో వచియింపలేదు. అదిగో వారు నవ్వుచున్నారు. పురుషులదంతయు గుంభనముదా!

బందరు చేరిన పిదప విజయుని తల్లిగారు కూడ మమ్ము బహుగా స్వీకరించిరి. కమలన్న నామెకిష్టమనియే నే గ్రహించితిని. కాన మన కమలా విజయులను వారి కుటుం బము చేర్చుకొనుట కీశ్వరుని బ్రార్థింపఁ బ్రార్థితులు. నే మండ వల్లి చేరినపిదప కమల నన్నెఱుఁగక పోయినను గ్రహించి

స్వీకరించి, నా హితోపదేశముల గైకొనెను. మాకొఱకు సంజయుఁడు చిక్కుఁడు చెట్టులో వేచియుండినను, బొజ్జయ్య పరలోకమున కేగునంతవఱకు మేమాగృహమును వీడలేదు. ఆగృహమున బొజ్జయ్యకుఁ గల నాలుగు రత్నలు ధనమంత టిని తస్కరించు చుండ నేను గూడ పదివేల రూప్యము లాసమయమున ముడిగట్టితిని. బొజ్జయ్యగారికి కమలకు ముందు గల నాలుగురు భార్య లదివఱకే పరలోకమునకు పరుగిడిరని గ్రహింపుఁడు (నవ్వు) బొజ్జయ్యకు సుతులు లేరు. కాన నతని దంతయు పరులసొమ్మగును. అందుచే నీధనమును దెచ్చి తినే గాని తస్కరించితినని దలఁపకుడు. ఈపదివేల రూప్య ములు మన మిత్రమండలి ధననిధి కుచితముగా నిచ్చుచున్న దాన. దీని నిందుగల పురుషులు పక్షపాతబుద్ధి లేక స్త్రీ విద్య కెక్కువగా వినియోగింపఁ బ్రార్థించుచున్నదాన. ఇంమ విషయమై తాతగారు తగుశ్రద్ధ వహింపవేడుచు నాకొలఁది మాటలు ముగించుచున్నదాన. (నవ్వు)

సు:— తాతగారూ! మిత్రులారా!

నేఁ జెప్పవలసిన దంతగాలేదు. నేను నాయుఁడుపేట స్టేషనులోఁ జెవిలో నూదిన పలుకులే ప్రధానముగ గైకొని కార్యము తుదముట్టించిన సంజయుని వర్తనము శ్లాఘనీయమైనది. కమలను వివాహంబాడుట పరమ ధర్మంబని బోధించినపుడు విజయుఁడేమియు మాటాడ కుండెను. అంత మన కార్యము గట్టెక్కదుగదా యని యధైర్యపడితిని. తుట్టతుదకు నా హితవు

నంగీకరించి మనమధ్య రతీదేవియో యన్నట్లు ప్రకాశించు కమలను జేపట్టిన విజయుని ధైర్యమునకు మెచ్చుకొను టవశ్యకము. కమలమార్గము కైలాసమునకుఁ దోడ్పడునని కమల తల్లి దండ్రులు గుర్తించి యామెను స్వీకరించులాగున భగవంతుని పదేపదే ప్రార్థింపఁ గోరుచున్నాఁడ.

గంగిరెద్దువాఁడు:—ఆర్యులారా! నాది విశాఖపట్టణము జిల్లాలోని చీపురపల్లి గ్రామము. నేను పాఠశాల కనుదినము పోని బండవిధవ నగుటచే నందఱు ఛీ, ఛీ యనెడివారు. శిక్షకుల జూఁడను. కొద్దియో గొప్పయో చదువుకుంటి. అటుపై నా కనుదిన చిల్లర వ్యయమునకు గాను పరుల ధనము దొంగిలించుట, రైళ్లలో మూటలవిప్పుట, గుళ్లు గోపురములకని దొంగ చందాలు ఎత్తుట వృత్తిగాఁగఁ బట్టుబడి దెబ్బలుదిని, ఎట్టకేలకు కారాగారము దర్శింప వలసినంతటి వాఁడనైతిని. అంత నా వృత్తిచేవిరక్తి నొంది జందెము వేసికొని సునాయాసముగా కృష్ణా గోదావరి పుష్కరములకేగి బ్రాహ్మణునిగా నటించి ధనము గడింప యత్నించితిని. నేర్చుకొనిన కొలఁది మంత్రములే యవకతవకలుగాఁ జదువ యదార్థము తెలిసికొని ఈ కృష్ణాపుష్కరమునసే మనమిపుడు సమావేశమైన ప్రదేశముననే కొందఱు నన్ను చచ్చునట్లు బాదిరి. ఇందులకీ యిసుకతిన్నెలును, ఈనదీమతల్లియుసాక్షి. అంత నావృత్తి విసర్జించి గంగిరెద్దువారిలోగలిసిపోయి దేశాటనముఁ జేయుచుండ మండవల్లి చేరితిని. అట సాజయుఁడు నేనును ప్రదర్శించిన నాటకము మీకెల్లఱకు విశదమే

గదా! బసవాశ్రమములోఁ బగలంతయు దయ్యములుబోగొట్టుట మొదలగు దేశసేవలో మునిఁగిపోయినను, రాత్రివేళల నాకెంతయో విద్యాబుద్ధులు గఱపి మీ సముఖమున నింత వ్యాకరణయుక్తముగ మాట్లాడునట్లు చేసిన యీసంజయుని, నాజీవితములో మరువఁజాల. కమలాదేవి కప్పుడప్పుడు విభూతిదీసికొనిపోయెడివాఁడను. నన్ను బాగుగ నాదరించెడిది. ప్రపంచము లెక్కచేయక నవమన్మథుని బోలిన యీ విజయుని వివాహమాడిన కమలాంబగారి ధైర్యమున కచ్చెరువొందవలెను. వీరికాయురారోగ్యాభివృద్ధి గలుగుటకై మనసభవారీశ్వరుని బ్రార్థింపఁ బ్రార్థితులు. నాకడసారి మనవి నాలకింపఁ గోరుచున్నాఁడ. నాకింతవఱకు వివాహములేదు. సంపాదించినది ధననిధి కచ్చితిమి. కాన మన సంఘమువారు నాయెడలఁ జేయవలసిన విధిని నెరవేర్ప వేఁడుచున్నాఁడ. మన సంఘ మొసఁగించు మేలు నా జీవితములో మరువఁజాల. సెలవు దీసికొనుచున్నాఁడ.

విజయుఁడు:—మాకై యీనవ జీవము ధారవోసిన మన సభ్యులందఱకు మా నమస్కారములు. తప్పులున్న క్షమింపప్రార్థించుచున్నాఁడ.

కమల:—మీరందఱు నాభావను నాకుఁ జేకూర్చి, యిట్లు సంతోషఁ బెట్టినందులకు శత వందనము లర్పించుచున్నదాన.

తాత:—మీ యుదంతంబంతయు విన నా మన మా నందించినది. వధూవరులు సిగ్గుచేఁ గాబోలు ఒకటి రెండు మాటలలో ముగించిరి (నవ్వు). సంజయుని ధూమశకటము లోని గంభీర సంభాషణమె నన్ని మిత్రమండలిలో సభ్యునిగఁ జేసినందులకు ధన్యుఁడనైతిని. గంగిరెడ్డు గంగయ్యానుకూడ నొక యింటివానిని జేయుట మన కర్తవ్యము.

నేఁడు సుదినము. ఐనది కమలా విజయుల కళ్యాణము. కూర్చున్నది కృష్ణానదీమతల్లి యొడ్డున. చేరినది ప్రజోద్ధారక సంఘము. మంచిది. ఇఁక మన కర్తవ్యమేమి ? నాఁడు నెల్లూరులోఁ బంచముని గెంటినందులకు నేఁటివఱకు పశ్చాత్తాపపడుచున్నాడ. తరతరముల నుండి భారత భూమిలోఁ బాదుకొనిపోయిన సాంఘిక దురాచారములఁ బారఁదోల మన యావజ్జీవముల ధారవోయవలెను. ఆనాఁడే మన కానందము—మనశ్శాంతి. పశువులవోలె సంతలలో విక్రయింపఁబడిన నీగ్రోలను రక్షింప తన ప్రాణములు సైత మిచ్చిన అమెరికా ప్రభువగు నబ్రహాము లింకను నొకతూరి స్మరణకుఁ దెచ్చుకొనుఁడు ! మన యుద్యమమునకు మహాభ్యుదయము చేకూరునట్లును, మన సంఘయశస్సు ఆచంద్ర తారార్కముగ నీ భువిపై నుండునట్లు నీశ్వరుని ప్రార్థింప సంజయుని గోరుచు నా స్థానముఁ దీసికొనుచున్నాను.

సంజయుఁడు:-"ఈశ్వరా ! ఒకానొకపుడు సమస్తకళలకు నివాసమై, శూరాగ్రేశ్వరులకు జన్మభూమియై, మత,సంఘ,సంస్కర్త

లకు తల్లిగడ్డయై, మహాకవులకు మాతృభూమియై, పేరు ప్రఖ్యాతులఁ గాంచిన నా భారతదేశ మిపుడు సప్త వ్యసనములకు లోనై, సాంఘిక దురాచారముల పాలై, నజ్ఞానాంధకారయుక్తంబగు దుఃఖాబ్ధి నీనులాడుచుండ, నద్దాని నుద్ధరింపఁ బూనిన మా యుద్యమంబునకు మహాభ్యుదయము చేకూర్చుము. తండ్రీ! ప్రజాసేవయే ప్రధానముగ నెంచిన మా ప్రజోద్ధారకమండలిని దీవింపుము. ప్రభూ! తమ యపార కరుణయె కమలానందమునకు కారణమయ్యె! లేనిచో మానవులమగు మేమెంతటి వారము? కమలా విజయుల నాశీర్వదింపుము. సర్వకాల సర్వావస్థల యందు మనశ్శాంతి, సుగుణశీలత, పారమార్థిక చింత, పరోపకారబుద్ధి, మా సభ్యులకెల్లరకు ప్రసాదించునట్లు తమను పదే పదే ప్రార్థించుచున్నాము.” అంత సభ ముగిసెను. భానుఁడస్తమించెను.

## తొ మ్మి ద వ ప్ర క ర ణ ము.

నూతన దంపతులగు కమలా విజయులు అంకమ్మగారి యింటియందెట్లు కాలము గడుపుచుండిరో వేరు చెప్పవలెనా! సంజయుడు గంగిరెడ్డు గంగయ్యయు మరుసటిదినమే నాయుడు పేట కేగిరి. సంతోషసుందరు లొకపక్షము దినములు కమలా సుందరు లానందాబ్ధిలో నోలలాడఁజేసి నాయుడు పేటకు పయనమైరి. ఈ వివాహ విషయమై వార్తాపత్రికలలో ఖండన మండనలు ప్రకటింపఁ బడినవి.

కమల తల్లియగు శారదగారి పోరుచే సోమయాజుల వారును, విజయుని తల్లియగు విమలాంబగారి పట్టుదలచేఁ బాకయాజిగారు కమలా విజయులఁ జేర్చుకొనిరి, అత్తమామలు చేర్చుకొనినపుడు వారికానంద మొదవకుండునా!

గంగిరెడ్డు గంగయ్య కీసభవారు నాయుఁడుపేటలో నొక కన్యను దెచ్చి వివాహ మొనర్చిరి. గంగిరెడ్డునకుఁ గల మహిమా మహిమలు తెలిసికొని మండవల్లివారు గడ్డిని సైతము వేయకపోవుటచే నది గంగిలోఁ గలిసెను. బసవాశ్రమములోని ముప్పురు దేశదిమ్మలు లేమైరో యెంతు లేను.

బొజ్జయ్యగారి దివసమున వైతర్ణీనది దాటించుట కొసంగిని యావు పెండ్లింద్ల పేరయ్యకివ్వ, నది పోట్లదై పొడుచుటచే బొజ్జయ్యతోఁ బాటు పేరయ్య పరలోకగతుఁడయ్యెను.

ప్రజోద్ధారక మండలివారు విజయుని యాజమాన్యమున తాతా సంజయుల సలహాలతో దేశమున కెంతయో మేలు జేయుచుండిరి. నేఁడు సంతోషసుందరులు వైశ్యులైనను భీతిలేక రెంటచింతల ప్రాంతమున కనుదెంచి దేశసేవ చేయుచుండినట్లు వార్తలు దెల్పుచున్నవి.

విజయునకు విజయనగర సంస్థానమున గొప్ప పదవి దొరకెను. కమల కెందరో పనికత్తెలున్నను దమయింటికి వచ్చువారిని బోవువారిని పరామర్శించుటలోఁ దీరిక లేదయ్యెను.

నాఁటి రేయి జాబిల్లివెన్నెల. విజయుని రాఁక సైగట్టి యెదురుపోయి 'బావా! నేఁడేల యాలస్యముగ వచ్చి చూడిరి.' యని కమల యనుచుండ విజయుఁడు చిఱునగవు నవ్వుచుండె. అంత కమలావిజయులు ఆత్మానందము నొంద నుత్సాహపూరితహృదయులై ప్రార్థనామందిరమునకుఁ బోవు చుండిరి.

నాఁటి యుద్యానవనములోని మాటలు నేఁడు కార్య రూపమును దాల్చెనుగదా!

ఆహా! నేఁడుగదా! మన మాతృభూమి కానందము.

సంపూర్ణము.

తెనాలి భారతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె. 1934

# పోషకులు.

శ్రీయుత గోవాడ రంగనాయకులుగారు తాలూకాబోర్డు ప్రసిడెంటు రేపల్లె.

,, గోవాడ సూర్యనారాయణనాయుడుగారు తాలూకాబోర్డు ప్రసిడెంటు కైకలూరు.

,, ఆళ్ళ వేంకటకృష్ణయ్యనాయుడుగారు Ex-వైసుప్రసిడెంటు తాలూకాబోర్డు రేపల్లె.

,, కుడితిపూడి రాఘవయ్యచౌదరిగారు మేనేజరు హిందూఎలిమెంటరీస్కూలు బేతపూడి.

,, నాదెళ్ల వెంకటసుబ్బయ్యచౌదరిగారు లోకల్ ఫండు ఇన్సెక్టరు రేపల్లె.

,, గోగినేని వెంకటగోపాలరావుచౌదరిగారు బి. ఏ., బి. యల్., వకీలు రేపల్లె.

,, గోగినేని రామనాథంచౌదరిగారు బి. ఏ., బి. ఎల్., వకీలు రేపల్లె.

,, నర్వాకుల వెంకటకృష్ణయ్యనాయుడుగారు Ex-వైసుప్రసిడెంటు తాలూకాబోర్డు తెనాలి.

,, వేములపల్లి నారాయణచౌదరిగారు నాగాయితిప్ప.

,, వీరమాచనేని సీతయ్యచౌదరిగారు భూస్వామి ఈడుపుగల్లు బెజవాడ తా॥

,, దాసరి శ్రీరంగనాయకులునాయుడుగారు లోకల్ ఫండు ఓవర్సీయరు రేపల్లె.

,, గద్దె వెంకటేశ్వరరావుచౌదరిగారు తుళ్ళూరు.

,, పర్చూరి నాగభూషణంచౌదరిగారు విలేజిమునిసిఫ్ బేతపూడి.

,, నెప్పాళ్ళ వెంకటకృష్ణయ్యచౌదరిగారు భూస్వామి చినపల్లపూడి.

,, యెఱ్ఱాశెట్టి నారాయణరావునాయుడుగారు హెల్తుఇన్సెక్టరు రేపల్లె.

,, ముమ్మలనేని అప్పయ్యనాయుడుగారు విలేజిమునిసిఫ్ రేపల్లె.

,, పసుపులేటి సీతారామయ్యనాయుడుగారు రేపల్లె.

,, కె. వీరయ్యనాయుడుగారు రేపల్లె.

,, వల్లపల్లి జంగయ్యచౌదరిగారు విలేజిమునిసిఫ్ దేవేంద్రపాడు.

,, పెసల యేసుదాసుగారు రెంటచింతల.

,, పర్చూరి అప్పయ్యచౌదరిగారు బెండ్లవారిపాలెం.

,, నీరుకొండ వెంకయ్యచౌదరిగారు నేటివ్ డాక్టరు ముప్పాళ్ళ సత్తెనపల్లి తాలూకా.

